

# స్వయంజ్యోతి

ఈ దివ్యగ్రంథము పఠించినవారికి ఇతరగ్రంథ సహాయములేకనే స్వయముగా జ్ఞానజ్యోతి ప్రకాశించునదగుటచే స్వయంజ్యోతి యను నీ సార్థకనామము పెట్టడమైనది.



సంకలనకర్త:

**సాధు వెంకటనారాయణస్వామి**



ప్రకాశకులు:


**ధ్యానకుటీరము,**

పెదఅవుటపల్లి పోష్టు, గన్నవరం తా॥ (కృష్ణా జిల్లా)





1950

వెల 1—8—0

వాణీప్రెస్, విజయవాడ

# భోజనకాల ప్రార్థన

—(o)—

శ్లో॥ అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్.

శ్లో॥ అన్నపూర్ణే సదాపూర్ణే శంకరప్రాణవల్లభే,
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం భిక్షాందేహి చ పార్వతీ.

శ్లో॥ మాతా చ పార్వతీదేవి పితా దేవో మహేశ్వరః,
బాంధవాః శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయం.

"మాతృదేవోభవ, పితృదేవోభవ,
ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ."

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః

శంభో శివ శివ శివ శివ శివ,
నారాయణ నారాయణ నారాయణ, ఓమ్.

—(o)—





# స్వయంజ్యోతి

ఈ దివ్యగ్రంథము పఠించినవారికి ఇతరగ్రంథ సహాయములేకనే స్వయముగా జ్ఞానజ్యోతి ప్రకాశించునదగుటచే స్వయంజ్యోతి యను నీ సార్థకనామము పెట్టబడమైనది.



సంకలనకర్త :

**సాధు వెంకటనారాయణస్వామి**



ప్రకాశకులు :

**ధ్యానకుటీరము,**

పెదఅవుటపల్లి పోష్టు, గన్నవరం తా॥ (కృష్ణా జిల్లా)



1950 వెల 1–8–0

వాణీప్రెస్, విజయవాడ

# పంచప్రాణములు

1 మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణ సుఖదుఃఖదాః,
ఆగమాపాయినో నిత్యాస్తాంస్తితిక్షస్వ భారత. 2-14

2 త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. 2-45

3 నప్రహృష్యే ప్రియంప్రాప్య నో ద్విజే త్ప్రాప్య చా ప్రియమ్,
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణిస్థితః. 5-20

4 యో నహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్సమేప్రియః. 12-17

5 బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి॥
సమస్సర్వేషుభూతేషు మద్భక్తిం లభతేప మ్॥ 18-54

ఇవి గీతయొక్క పంచప్రాణములు జీవన్ముక్తి పదవిలో నిలుచువారు, నిలవదలంచువారు యీ ఐదు శ్లోకములను నిరంతరము భావనచేయుచుండవలెను. ఒకప్పుడు గీతాపుస్తకము పారాయణకు అనుకూలపడకపోయనను యీ శ్లోకపంచకమునైన పఠించుచుండినచాలును. దీనియొక్క అర్థము యీ శ్లోకములయొక్క అధ్యాయములలో శ్లోకసంఖ్యలను జూచి తెలుసుకొనవచ్చును. దైవభావమునుండి మనస్సు యెప్పుడైన దృశ్యములోనికి జారుచున్నదని తోచినచో దీనియొక్క అర్థచింతనముచే సౌధమునుండి క్రిందకు పడిపోయినవాడు మరల నింపాదిగా సోపానములనెక్కుచు గమ్యస్థానము జేరునట్లు యిది వుపయోగపడును.

# విషయసూచిక

# భూమిక

ఆత్మస్వరూపుడగు సద్గురువునకు సదా మంగళ మగుగాక.

"ఏన వ్రతపతే సాధు రసాధుస్తే నతుష్యతి॥

తా॥ సజ్జనులు దేనిచే సిగ్గునొందుచున్నారో దుర్జనులు దానితో సంతుష్టి నొందుచున్నారు.

ఈ ప్రపంచము దుఃఖరూపమైనదని జిజ్ఞాసువులందరకు అనుభవముద్వారా తెలిసినవిషయమే. మనము అవతారపురుషు లనుకొనేవారుకూడా సంసారములో క్లేశాన్ని అనుభవించారు. మరియు, వారు సంసారము దుఃఖరూపమైనదని చెప్పిరి. అందు, శారీరక మానసిక దుఃఖములు అనంతములైనవి. ఇట్టి దుఃఖమునుండి తప్పించుకొనుటకు ఆత్మజ్ఞాన మొక్కటియే సాధనము. ఆత్మజ్ఞానము వైరాగ్యము లేకుండా యెవరికిని సిద్ధింపదు. అనేకమంది మహాపురుషులు వైరాగ్యముయొక్క ప్రభావము చేతనే ఆత్మజ్ఞానముపొంది యెట్టి మహోన్నతిని గాంచిరో వినియే వున్నాము. ఆత్మజ్ఞానసాధనములలో వైరాగ్యమే ప్రధానమైనది. వైరాగ్యవంతుడు యతిగాని గృహస్థుగాని వర్ణాశ్రమములేవైన గాని అతనికే కీర్తిప్రతిష్ఠలు - ఆత్మశక్తి గలిగి పూజ్యుడయ్యెనుగాని, రాగవంతునకు లభింపలేదు.

ఈ గ్రంథమందు పరమానంద పరమహంస, రామతీర్థ, సద్గురు మలయాళస్వామి, రామకృష్ణ, వివేకానంద, దయానంద, యాజ్ఞవల్క్యమహర్షి, అష్టావక్రమహాముని, గాంధి

మొదలగు మహాపురుషులు ధ్యానసమాధ్యవస్థలలో తన్మయు
తిలకించిన సత్యాంశములు అనేక గ్రంథములలో పరిశోధిం
ఆ జ్ఞానామృతమును యీ గ్రంథభాండమున నింపివుంటిమి.

ఇయ్యది ముముక్షువులు ముక్తిసాధము జేయుట
నిచ్చినవలె ప్రత్యక్షప్రమాణములతో నిరూపింపబడినది. క
సజ్జనులకు ప్రాణాధారమైనది. దీనిని పఠించినవారికి బుద్ధిక
ల్యము. భక్తిజ్ఞాన, వైరాగ్యములు, వేదాంతానుభవ
ప్రాప్తి చును. ఈ గ్రంథము సకలశాస్త్రములకు, సకలధర్మ
లకు మాతృస్థానమై వివేకములే ఫలములుగా ఫలించి నూత
ముగా శోభించు నుద్యానవనమువలె నుండును.

# బ్రహ్మవిద్యావతి బ్రహ్మవేత్తను ప్రార్థించుట

ఒకసారి అనధికారి పురుషులయందు ప్రాప్తమైన బ్రహ్మవిద్యావతి అత్యంత దుఃఖమునొంది బ్రహ్మవేత్తల సన్నిధికేగి యేడ్చియేడ్చి యిట్లు ప్రార్థన జేసెను.

ఓ బ్రహ్మవేత్తలారా! ఎట్లు వేశ్యాస్త్రీ సకలపురుషులను సేవించుచున్నదో అట్లు, ధనలోభముచేతగాని శిష్యలోభము చేతగాని నన్ను వేశ్యసమానముగా చేయకుడు. కులస్త్రీ న్యాయముగా నన్ను గుప్తముగా నుంచి రక్షణ చేయుడు. శ్రద్ధచే నా సేవ చేసినవారికి బ్రహ్మవిద్యావతియగు నేను యీ లోకమందును, పరలోకమందును అక్షయసమానముగా నుందును. అందువలన నన్ను అన్యపాత్రమందు వినియోగము చేయకుడు. ఓ బ్రహ్మవేత్తలారా! నాయందు దయవుంచి నన్ను గుణహీనపురుషున కివ్వకుడు. ప్రియకన్యయొక్క తండ్రివలె నాదానమును గురించి కొంచెము విచారము చేయుడు. ఎట్లు అత్యంత రూపవతియగు ప్రియపుత్రిని ప్రియపిత నపుంసకున కివ్వడో అట్లే నేను మీకు ప్రియకన్యకనగుట వలన నన్ను దుర్గుణ షండపురుషున కివ్వవలదు. తండ్రులారా! గుణరహిత షండపురుషున కిచ్చినపక్షమందు నా కెన్ని తాపములగునో చూడుడు. 1. సద్గుణపురుషుని దోషారోపము 2. కుటిలత 3. ఇంద్రియాధీనత 4. నిత్య స్త్రీ సంగము

5 అసత్యమత 6. గురుభక్తిరహితత. ఈ మొదలగు అనేక దోష తాపములు నేను భరింపజాలను. ఓ తండ్రీ! శమదమాది గుణసంపన్నుడగు పురుషునకు నన్ను కన్యాదానము చేయుము. అనగా, నాకు పెండ్లియేవలదు. నీహృదయకమలమగుగృహము యందే నన్ను గుప్తముగా వుంచుము. ఈ రెండు పక్షములలో ఒకపక్ష మంగీకార మగునేని నేను మీకు కామధేనున్యాయముగా వాంఛితార్థసిద్ధి చేసెదను. ఇట్లుగాక ధనలోభము చేతగాని, శిష్యలోభముచేతగాని, గుణహీనపురుషునకు బ్రహ్మవిద్యావతి నగు నన్ను యిచ్చినపక్షమందు ఫలరహిత లతలవలె నేను గొడ్డురాలనగుదును. నేను సంతోషముగా లేనిచో—నన్ను దుఃఖపెట్టినచో - దానముచేసినవారి - ధనసంపత్తులు నశించి విపత్తులు ప్రాప్తించి, మరణానంతరము నరకప్రాప్తు లగుదురు. కాన, మీకు బ్రహ్మవిద్యయందును, నా రక్షణమందును అభిప్రాయము గలిగివున్నపక్షమున మీరు గుణవంతులగు శిష్యులకు బ్రహ్మవిద్యాప్రదానము చేయుము. అన్యథా వినియోగము చేయకుందురుగాక.

# స్వామి రామతీర్థ

1. నీవు సత్యమును నిశ్చలచిత్తముతో నారాధించు టకు మొదలిడిననాడు ధనము, ధనమదాంధీభూతుల నాశ్ర యించు మౌఢ్యము నీ దృష్టియెదుట బడక మటుమాయ మగును.

2. సత్యస్వరూపియగు భగవంతునియందచంచల విశ్వా సము గలిగి యాత్రచేయుము. సత్యస్వరూపుడ నేనే నని అను భవపూర్వకముగ గర్జించినయెడల దూషణాస్త్రములు నీ యంతరంగమును తాకజాలవు.

3. సత్యాకాశమున నీవు ఒంటరివై విహరింపుము. అప్పుడు ధర్మజ్యోతియగు సూర్యుడే నీ మిత్రుడై నిలచును. నలుదెసలనుండి నీ సత్యవాణిని విని తరించుటకు లక్షలకొలది నీచుట్టు మూగుదురు.

4. నీవు వేయిసంఘములను స్థాపించ నవసరములేదు. అన్ని సంఘములు నిన్నే ఆరాధించును. సత్యరక్షణము మానవమాత్రులపై ఆధారపడిలేదు. సూర్యరశ్మిని ప్రకటించు టకు వార్తావహులు కావలెనా ? సత్యము స్వయంనిర్ణయ పోషణశక్తిగలది.

5. నీ అంతరంగజీవితములో సత్యమును నీవు విశ్వ సించి ఆరాధించుచుండినచో విశ్వమంతయు నిన్నర్చించి

తీరును. సత్యారాధనమే పుత్తమోత్తమమైన కర్మయోగము. సత్యారాధకునికి లభించు బలము అనివార్యము. సత్యప్రియుని స్వాతంత్ర్యము వరించును. సత్యశీలుని యెదుట బాహ్య ప్రభు శాసనములు వంగి నమస్కరించును.

6. ఆత్మప్రియులగు సంస్కర్తలారా! ధనికుల అభిరుచి కనుగుణముగా నుపన్యసించుటవలన మీ వ్యక్తిత్వమునకు కొంత తాత్కాలిక గౌరవము లభింపవచ్చును. కాని సత్యము దరిద్రులగు స్త్రీ బాల శూద్రులందే ప్రతిఫలించి వారిమూలముననే వృద్ధినొందును.

7. ఒకవిత్తనము మహావృక్షము కావలెనన్నచో మొదట విత్తనము నాశనము నొందవలెను. అట్లే 'నే' నను అహంభావము పండుటాకువలె దుల్లిపోవునపుడే పరిపూర్ణ స్వాతంత్ర్యము, ఆత్మానుభవ ఫలసిద్ధి పొందగలవు.

8. మానవము శరీరసుఖముగోరి తుచ్ఛేంద్రియానుభవములకై మన శక్తిని వ్యయపరచినచో ఎన్నిటికిని దుఃఖనివృత్తి, ఆనందప్రాప్తి పొందలేము. సత్యాన్వేషిని – నిత్యసంతోషిని జయలక్ష్మి వరించి, నిరంతరము వెంటాడుచుండును.

9. న్యాయాధ్యక్షుడు న్యాయభవనములోనికి వచ్చునపుడు న్యాయవాదులను ముద్దాయిలను సాక్షులను పిలువనక్కరలేదు. అతడు వచ్చినంతనే సమస్తమును జరిగిపోవును. అట్లే సత్యాన్వేషకునికి వలయు సామాగ్రి ప్రకృతియే సిద్ధపరచి జయమును చేకూర్చును.

10. వేదాంతశాస్త్రములో నిగూఢమై వున్న సారమును గ్రహించుటకు కుశాగ్రబుద్ధులకైనను కష్టసాధ్యము. ప్రత్యేకము పాండిత్యముగలవారికిని వుపనిషదర్థము బోధపడదు. మహాపురుషులు ధ్యానసమాధ్యవస్థలో తన్మయులై తిలకించిన సత్యాంశములు తెలిసికొనుటకు లౌకికభాషాప్రాగల్భ్యము నిరర్థకము. వేదాంతజ్ఞానసారమును చవిచూడగోరువారు కొన్ని లక్షణములు గలిగి వుండవలెను. మహర్షులవాక్యములు మహర్షి దృష్టిగలవారికే విదితములు కాగలవు. వుపనిషదర్థము ఏకాగ్ర దృష్టిని గోరుచుండును. భోగరాగాదులను సంపూర్ణముగా త్యజించి సర్వమానవశక్తిని యేకధారగా కేంద్రీకరించినపుడే అంతలి సౌరభము - సౌందర్యము ప్రత్యక్షమగును. ముసలితనముచే మొరటుబారిన శుష్కహృదయులకుగాని, భోగలాలసత్వముచే వస్తుసంతతికై పరుగులిడు చలితమానసులకు గాని, క్రోధమోహాదిభూతములచే గట్టువడిన లజ్జాహీనులకు గాని, త్యాగాగ్నిలో తప్తములై వైరాగ్యామృతసారములో శుద్ధములై బయల్పడిన పరమాత్మ రహస్యసూత్రములు ద్యోతకములుగావు.

11. ప్రతివ్యక్తిలో గర్భితమైయున్న పరమాత్మను దర్శింపవలెనన్న మమకారభూయిష్టమగు దైహికాత్మ దగ్ధమైపోవలెను. మనలోవున్న దేహాభిమానపూరితమగు నహంకారము దహనమొనర్చినంతనే పరమాత్మ తన సహజదివ్య తేజములతో విలసిల్లును. పరమాత్మను మరచి యీ అల్ప మానవవ్యక్తిత్వముతోగూడి అహంకారమే నిత్యాత్మయని

తలంచు మూర్ఖుని మోహాగ్రద్దలు పొడిచి చంపును. మానవ స్వభావమును బిగబట్టుకొని యీశ్వరకటాక్షము నాశించుట వేదాంతసందేశము కాదు.

ఈ పరమాత్మధర్మము తలక్రిందుగా నర్థముచేసుకొని వేలకొలది మానవులు తుదిలేని దుఃఖాంబుధిలో మునుగు చున్నారు.

12. వేదాంతము, నిన్ను తీవ్రకృషిద్వారా అహంకారానికి దూరముగ నుండుమనును. స్వార్థముతో మనముచేసే నిరంతరకృషి అంతా మన ప్రయత్నమున నాశనము చేయును. ఏ క్షణములో నీ కోర్కెలను అధిగమించెదవో, అప్పుడు నీ వాంఛోద్దేశము నిన్ను వెదకుచు రాగలదు.

13. నీ వెప్పుడు ఐహికవాంఛలకు దాసుడవగుచు అర్థించడము, బిచ్చమెత్తడము మొదలిడెదవో అంతవరకు ఆత్మరాజ్యములో విఫలుడవే. అర్హతాయోగ్యత గలవారిని సిద్ధు లన్నియు వెదకుచుండును. అంతరాత్మను శాంతిగా వుంచుము. శరీరానికి నిరంతరము పనికల్పించుము. శరీరమును పాలించునది నిరంతరకృషి. ఆత్మను పాలించునది నిర్వికల్పస్థితి.

14. విశేష విలువగల నేయిని కృత్రిమహస్తములతో తయారుచేయబడిన అగ్నిహోత్రములో హోమముచేయుటకు బదులు, జీవచ్ఛవములై ఆకటిబాధచే అల్లాడుచున్న దరిద్ర నారాయణకోటిలో ఆహారములేక మాంసము నమలివేయుచు నెముకులనుకూడా కొరికివేయుచున్న జఠరాగ్నిగుండములో నాలుగు అన్నపు ముద్దలను హోమముచేయరాదా ?

15. మానవుడు తన కాలమంతయు భయముతోడను సందేహములతోడను నే నెట్లు బ్రతుకుదునాయను తుచ్ఛవిచారణతో కాలము గడపుటకు పుట్టలేదు. నీటిలో గల చేపలు, వృక్షముల మీది పక్షులు వీనికి గల ఆత్మగౌరవరాభిమానముల నైనను మానవులు చూచి నేర్చుకొనవలెను. దేవ నర పశు పక్షి క్రిమి కీటక తిర్యగాదులయందు తనయందు తనకు గల ప్రేమను సమరసభావముతో వాక్కు-క్రియాదు లన్నిటియందు జూపిననాడు యిలాటి అవిశ్వాసభావము లుండవు. అపుడే "అనన్యాశ్చింతయంతో మామ్" అను శ్లోకము సార్థకమగును. సత్యమునకే నీ ప్రాణము లర్పింపుము నీవు పరమేశ్వరుని సాన్నిధ్యమున నుందువు. దేవతలుకూడా నీ నామమునే భజించుచుందురు.

శ్లో॥ సర్వేషా మపరాధానాం యతినిందా గరీయసీ,
యతి ర్నారాయణస్సాక్షా త్తస్మా త్తాం పరివర్జయేత్॥

# మహాత్మా గాంధి

గాంధిగారిని "దేవు డున్నాడా" అను ప్రశ్నకు ది 23-5-1938 ఆంధ్రపత్రికలో జవాబు.

ఈ విషయము భౌతికముగా వాదింపదగినది కాదు. వాదమువలన ఇతరులకు నమ్మకము గలిగించుట యెవ్వడును సాధ్యముకాదు. వాదమువలన యితరులకు నమ్మకముకలిగింప వలెనని మీరు కోరినచో నేను విఫలుడ నగుదును. ఈ గదిలో మీరు నేను కూర్చునియున్నామను విషయముకంటె భగవంతు డున్నాడను విషయమునందే నా కెక్కువ నమ్మకము కలదనిమాత్రము నేను నిర్ధారణగా చెప్పగలను.

గాలి నీరు లేకపోయినను, మీరు నా కనులు తీసివేసినను మరి యే అవయవము లూడబీకినను జీవించియేయుందును. కాని, భగవంతు డున్నాడను విషయమున నా నమ్మకము మీరు తొలగించినవెంటనే నా శరీరము పీడిపోవును. ఇది మూఢవిశ్వాస మనవచ్చును. నేను రామనామమునుమాత్రము మరచివుండజాలను. ఒకప్పుడు అన్నమునయినా మరిచెదను. అన్నముమాత్రము భుజించి రామనామము మరచినరోజున నాకడుపు ఆకలిచే దహించుచుందును. రామనామజపము వల్లను, సంకీర్తన ప్రార్థనాదులవల్లను ఎటువంటి కఠినరోగము లైనను హరించి శరీరమంతయు తేజోవంత మగును.

నాకు భగవంతునియందు సంపూర్ణవిశ్వాస మున్నది. నేను ప్రతి స్వల్పవిషయములో కూడా పూర్తిగా భగవంతుని మీదనే ఆధారపడి యున్నాను. భగవన్నామము నేనుచేయు న్యాయ వ్యవహారములలో లోపములను చూపుచు నిర్విఘ్నముగా శుభము చేకూర్చుచున్నది. గీతయే నా కన్నతల్లి. నా కేసందేహము గలిగినను గీతలో యే ఒక శ్లోకము అర్థ సహితముగా చదివినను సందేహనివృత్తి, దుఃఖనివృత్తి, ఆనందప్రాప్తి గలుగును. గాలి నీరు ఆహారము మన కెంత ముఖ్యావసరమో భగవద్ధ్యానముకూడా శరీర సంపూర్ణారోగ్యమున కంత ప్రాముఖ్యము. శరీర మానసికములకు తోడ్పడు పరిశ్రమయే ఆదర్శప్రాయమైన పరిశ్రమ. అదియే మానవునకు నిజమైన ఆరోగ్యము నొసంగును. మన నిత్యజీవితమునకు మన ఆరోగ్యమునకు యెంతయో సంబంధ మున్నది. మనము పరిశుద్ధజీవితముగడిపినగాని పూర్ణారోగ్యమునుబడయజాలము. మలినమనస్సు శరీరమునుకూడా మలినభూయిష్ట మొనర్చును. ప్రార్థన, దయ, సత్యము లే అన్ని వుదార కార్యములకు పెన్నిధానములు. దైవధ్యానము కల్పవృక్షము వంటిది. దైవధ్యానమే మానవ జీవయాత్రకు నావవంటిది.

శ్లో॥ యథాగ్నిర్దారుమధ్యస్థో నో త్తిష్ఠే న్మథనం వినా,
వినా చాభ్యాసయోగేన జ్ఞానదీప స్తథా నహి॥

# శ్రీ బుద్ధ భగవానుడు

1. ఏ ప్రకారముగా గొల్లవారు కర్ర చేతబట్టుకొని గొర్రెలను అడవులకు మేతకు తోలుకొనిపోవుచున్నారో అదే విధముగా వార్ధక్యము మృత్యుదేవత లను గొల్లవారు నరక స్వర్గములను అడవులకు పాపపుణ్యఫలము లను మేతను మేపుటకై మరణమను కర్రను చేతపట్టుకొని తోలుకువెళ్లుచున్నారు.

2. పాపికూడా ఎంతవరకు తానుచేసిన పాపఫలమును భవమునకు రాలేదో అంతవరకు తానును సుఖమునే పొందుచుండును. అజ్ఞాని పాపకర్మలుచేయునపు డది పాపకర్మయని తెలిసికొనజాలడు. ఫలానుభవమునకు వచ్చినపుడు అగ్నిచే కాల్చబడిన వానివలె తపించుచు దుఃఖము ననుభవించును.

3. సుఖముగోరునట్టి ప్రాణులను తనయొక్క సుఖము కొరకు ఎవరు బాధించుదురో వారు జలమునుండి బయట బడినచేప తపించినట్లు తపించుచు మరణానంతరమున నరకలోక ప్రాప్తినొందుదురు.

4. జననమరణాది దుర్దశారూపదుఃఖము మరల గలుగ జేయునిది, సంసారవ్యాధికి ఔషధము నగునది అధ్యాత్మ శాస్త్రమే. ఆధ్యాత్మికజ్ఞానముచేతనే సంసారవిషూచిక శాంతించును. కాన ఆత్మజ్ఞానపరాయణులై నటువంటి బ్రహ్మనిష్ఠులను ఆత్మశాస్త్రవేత్తలను శరణుపొంది ఆత్మజ్ఞానమును అర్థించుచు, పరమాత్మయందే నిరంతరము ఆత్మవిచారము చేయుచుండ

వలయును. అట్లుగానిచో ధనస్సున సంధింపబడి విడిచిన బాణము వలె సుఖములన్నియు వీడిపోయి భోగతృష్ణమాత్రము వర్షాకాలమందలి సొరతీగవలె పెరిగి శవముమీద గద్దలువ్రాలినట్లు మీ హృదయమున త్రివిధతాపత్రయములు తరంగసమూహములవలె నావిర్భవించి దుఃఖసాగరములో ముంచును.

5. ప్రాపంచిక విషయములను వమనాన్నము వలె విడచి విధిప్రకారము సదాచార్యుని శరణుపొంది, గురుసన్నిధియందు కొంతకాలముండి వైరాగ్యధ్యానానుష్ఠానములను అనుష్ఠించినవారికిమాత్రమే తెల్లని శుద్ధవస్త్రముపై కుంకుమ జలబిందువులవలె నిర్మలచిత్తమున గురూపదేశ వాక్యములు విశ్రమించును. అపుడే శుద్ధరూపత్వమును బడసి జ్ఞానప్రాప్తికి యోగ్యుడై భవనాశకరంబగు దివ్యమైన పరమశాంతి లభించును.

6. సుగంధము వాయువు యేవైపునకు వీచునో ఆవైపునకే పోవుచుండును. సజ్జనునియొక్క ఆచరణయుక్త జ్ఞానపరిమళము దశదిక్కుల వ్యాపించును. వస్తువుయొక్క సుగంధము వస్తునాశముతోనే నశించును. సత్పురుషులయొక్క సదాచారసుగంధము వారి జీవితాంతర మెన్నియో ఖండఖండాంతరముల వ్యాపించి ప్రకాశించుచుండును. బ్రహ్మనిష్ఠులు నాశరహితు లగుటవలన బ్రహ్మాది దేవతలుకూడా మాకట్టి భాగ్యము ఎప్పుడు గల్గునాయని స్తోత్రము చేయుచుందురు.

7. భగవంతుని పూజించుటయనగా ఈశ్వరనిర్మితములగు దయాసత్యధర్మానుష్ఠానములను నియమకాలమున జరిపిన్న, జీవితము నిష్కళంకముగా గడుపుచుండుటయేయగును.

స్వార్థపరులై యితరప్రాణికోట్ల ఆనందమునందు విముఖత్వము జూపినంతకాలము పశువులకంటె అధములని తెలియవలెను. అట్టి హింసాపరునకు గ్రంథముల కాళ్ల ననుసరించి రథచక్రము లేగునట్లు పాపమెనురై యెచ్చటను దుఃఖమే సిద్ధముగా వుండును.

8. దేవతాసంభూతులగువారు ఎల్లప్పుడు పుణ్యకార్యములు చేయుటయు, చేయువారికి సహాయము చేయుటయు, అట్టికార్యములు చూచి ఆనందించుటయు గలవారై వుందురు.

ఆసురాంశసంభూతులగువారు పాపకార్యములు చేయుటయు, అట్టివారికి సహాయము చేయుటయు, పుణ్యకార్యములను చెరచుటయు, చెరచువారికికూడా సహాయము చేయుచుందురు. ఇట్టివారు, గొప్పవృక్షమును పెనుగాలి కూకటి వేళ్ళతో పడగొట్టునట్లు కొలదికాలముననే తనకున్న సిరి సంపద విపత్తుగా పరిణమించి కారణము తెలియకనే అపారదుఃఖమునొందుచున్నారు.

9. ఇంటిమీద కప్పులేనిచో వర్షము కురిసి ఆ యింటిలోనివారికి దుఃఖకరమగు బాధయెట్లు కలిగించునో, అట్లే ఇంద్రియ సంయమనము లేనివాని హృదయములో రాగద్వేషములను విషయవర్షము కురిసి అపారదుఃఖములో ముంచును.

10. కాలసర్పమను మృత్యుదేవతనోటిలో నీ ఆయువు దినదినము మింగబడుచు హరించిపోవుటను గాంచనేరక

ఇంకను ఇంద్రియసుఖము లనుభవింపవలెననియు, భోగానుభవము పొందవలెనని యున్నవానిని మృత్యుదేవత వాని అనుభవము పూర్తిగాకమునుపే మ్రింగివేయుచున్నది. భిక్షువులారా! మీరు పండుటాకువలె శిథిలమైయున్నారు. మీప్రయాణము సిద్ధముగా వున్నది. దారిబత్తెమునకు కావలసిన పుణ్యధనమును సంపాదించి నీకొరకొక రక్షణస్థానమును నిర్మించుకొని తయారుగా వుండుడు. ఆయువు సమాప్తి యగుచున్నది.

# దుఃఖనివారణ శ్లోకపంచకము

శ్లో॥ యావత్కాలం భవేత్కర్మ తావత్తిష్ఠన్తి జంతవః,
తస్మిన్ క్షీణే వినశ్యంతి కా తత్ర పరిదేవనా॥ 1

తా॥ తాను జేసిన కర్మననుసరించి ప్రాణికోట్లు జీవించివుండును, కర్మ నశించగానే శరీరమువిడచి పోవుచున్నవి. కాన, మన మేల దుఃఖించవలయును?

శ్లో॥ ఋణానుబంధరూపేణ పశుపత్నీసుతాలయః,
ఋణక్షయే క్షయం యాంతి కా తత్ర పరిదేవనా॥ 2

తా॥ ఋణానుబంధమువల్లనే భార్యాబిడ్డలు సిరిసంపద గలుగుచున్నవి. ఆ ఋణము తీరిన తక్షణమే శరీరము సిరిసంపదలు నశించిపోవుచున్నవి. కాబట్టి మన మేల దుఃఖించవలెను?

శ్లో॥ ఇదం కాష్ఠ మిదం కాష్ఠం నద్యాం వహతి సంగమమ్,
సంయోగశ్చ వియోగశ్చ కా తత్ర పరిదేవనా॥ 3

తా॥ ఏప్రకారముగా ఒక నదీప్రవాహము పారుచుండగా ఒక దేశమందుండు చెట్లను కట్టెలను కొట్టుకొనివచ్చి మరియొక దేశమందుండు కట్టెలతో జేర్చుచున్నదో, ఆ ప్రకారముగానే కర్మమనుప్రవాహము ఒకదేశమందుండు శరీరమను కట్టెలను ఆ సంబంధము నెడబాపి మరియొక దేశమందుండు శరీరములతో జేర్చుచుండును.

శ్లో॥ పక్వాని తరుపర్ణాని పతంతి క్రమశో యథా,
తథైవ జంతవః కాలే కా తత్ర పరిదేవనా॥ 4

తా॥ ఎట్లు చెట్లయందలి కాయలు పండ్లు పూవులు ఆకులు ఆయా కాలమందు యెండి రాలిపోవుచున్నవో, అట్లే కాలము సమీపించినంతనే ప్రాణికోట్లన్నియు రాలిపోవును. కాబట్టి యేల దుఃఖించవలెను?

శ్లో॥ ఏకవృక్షసమారూఢో నానాజాతి విహంగమాః,
ప్రభాతే విధిశో యాంతి కా తత్ర పరిదేవనా॥ 5

తా॥ ఏప్రకారముగా ఒక చెట్టుమీద సాయంకాలమునకు అనేకపక్షులు గుంపులుగుంపులుగా జేరి ఆరాత్రి వుండి తెల్లవారగానే ఆచెట్టు విడచి నానాదిక్కులకు పోవుచున్నవో, ఆప్రకారముగానే కర్మవశంబున జీవులు భూలోకమున సంసారమను వృక్షముమీద ప్రవేశించి కర్మము క్షీణించినంతనే వారువారు చెప్పకనే పారిపోవుచున్నారు. ఇది సహజము కాబట్టి, దీనికి మన మేల దుఃఖించవలయును?



# స్వయం జ్యోతి

## వివేకాశ్రముని చరిత్రి

[ స్వామి పరమానంద పరమహంస ]

గొప్ప మహాత్ముడు, విరక్తుడు అయిన వివేకాశ్రము డను పేరుగల ఒక సన్యాసి చాలాకాలమునుంచి తనకు నివాస యోగ్యమైన ఆశ్రమమును వెదకుచు వుండెను. వెదకుచు వెదకుచు ఆయన యీ ప్రపంచములో ఒకటి తక్కువ 84 లక్షల ఆశ్రమములను చూచెను. కాని నివాసయోగ్య మైనది మాత్రము కనుపించలేదు. అపుడు ఆయన చాలా చింతతో ఒక ప్రదేశమునందు కూర్చుని, ఆలోచించ సాగెను. ఏకాంతవాసమున తప్ప యితరప్రదేశములందు పరమార్థచింత నము చాలాకష్టము. ఆత్మజ్ఞానము పొందుటకు తగిన నిర్మల ప్రదేశము దొరకక వివేకాశ్రముడు యిదే ఆలోచనలో నిమ గ్నుడై వుండగా యింతలో చాలా సుందరమైన ఒక ఆశ్ర మము కనుపించెను. ఆ యాశ్రమము ఎటువంటిదనగా, క్రింద సుందరమైనటువంటి రెండు స్తంభములు,తొమ్మిది ద్వారములు కలిగి వున్నది. ఆ యాశ్రమమును చూచి వివేకాశ్రముని మనస్సు చాలా ప్రసన్నపూరితమై తనకు నివాసయోగ్యమైనదని

తలంచి, అచట తన ఆసనమును పరచెను. అపుడతడొక విస్మయపూర్ణదృశ్యమును గాంచెను. నవయౌవనవతియగు ఒక సుందరస్త్రీ చేతులయందు కమలపుష్పములు తీసుకొని ఆ ప్రదేశమునకు వచ్చి తన క్రీగంటితో వివేకాశ్రముని వైపు చూడసాగెను.

ఆ స్త్రీని చూచి వివేకాశ్రముడు చాలా దుఃఖితుడై తనలో తానిట్లనుకొనసాగెను. నేను నానివాసయోగ్యమైన ఆశ్రమముకొరకు వెదకివెదకి కట్టకడకు యీ రమణీయమైన ఆశ్రమము కనుగొనగల్గితిని. దానిలో విఘ్నస్వరూపిణియు, సమస్త అనర్థములకు కారణమునగు యీ స్త్రీ పిశాచము యెచ్చటనుండి వచ్చినది? మోక్షమార్గమునకు స్త్రీ ప్రథమ శత్రువు. అందువలననే యతి స్త్రీని దర్శించుటకూడ దోషమని చెప్పుదురు,

జితాహారోఽథవా వృద్ధో విరక్తో వ్యాధితోఽపి వా,
యతిర్నగచ్ఛేత్తం దేశం యత్రస్యాత్ప్రతిమాస్త్రియః॥

—అద్వైతామృతవర్షిణీ

యతి నిరాహారియైనను, అథవా వృద్ధుడైనను, లేక విరక్తుడైనను, రోగపీడితుడైనను, స్త్రీయొక్క చిత్రపటమున్న ప్రదేశమునకుకూడా వెళ్ళరాదు.

సంభాషయో స్త్రియంనైవ పూర్వదృష్టాం చ న స్మరేత్,
కథాం చ వర్జయేత్తాసాం నోపశ్యేల్లిఖితామపి.

—ధర్మశాస్త్రము

యతి స్త్రీతో మాట్లాడకూడదు. పూర్వము ఎప్పుడైన చూచిన ఆమెను మనస్సునకూడా తలంచరాదు. స్త్రీకి సంబంధించిన కథలుకూడ వినకూడదు.

యస్తు ప్రవ్రజితో భూత్వా పునః సేవేత్తు మైథునం,
షష్టివర్షసహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

సన్యసించినతరువాత ఎవరు విషయసుఖ మనుభవించెదరో (మైథునము) వారు 6000 సంవత్సరములు మలమునందు క్రిములై జన్మించెదరు.

విషయాసక్తచిత్తో హి యతి ర్మోక్షం నవిందతి,
యత్నేన విషయాసక్తిం తస్మా ద్యోగీ విసర్జయేత్॥

విషయాసక్తుడైన యతి యెప్పటికి మోక్షము పొందలేడు. కాన ప్రయత్నముచేత తన మనస్సును విషయాసక్తతనుండి మరల్చవలయును.

ఇటువంటి ధర్మశాస్త్రములలో చెప్పబడిన వాక్యములను స్మరించుచు వివేకాశ్రముడు తన మనస్సున అనుకొనసాగెను. ఒకవేళ యీ స్త్రీ యీ ఆశ్రమమందే వుండినచో నా తమ్ముడగు వైరాగ్యాశ్రముడు యిచ్చట ఎలా వుండగలడు? అతడు చాలా పిరికివాడు. స్త్రీయొక్క నీడను చూచినంతనే పారిపోవువాడు. మరియు ముముక్షువుకూడా, ఇచటికి రాడు. వీరందరు రానందున ముక్తిమార్గముకూడా విచ్ఛిన్నము కాగలదు. గాన యీమెను యిచటనుండి వెళ్ళగొట్టు నుపాయమేదైన చూడవలెను. మొదట యీమె ఎవరైనది, యెందుకిచటి కొచ్చినది తెలిసికొనెద. ఈ సమయమున ఆమెతో మాట్లాడుటకు ఎవరునులేరు. గనుక, నేనే పలుకరించెద.

వివేకాశ్రముడు:—"లలనా? నీ వెవరవు? ఎచటనుండి వచ్చితివి? ఏ పని నుద్దేశించి వచ్చితివి? నీ విచట వుండెదవా లేక వెళ్ళెదవా? వివేకాశ్రముని యిటువంటి సుందర వాక్యములను విని ఆమె నవ్వుచు యిట్లనెను. "వివేకాశ్రమా

నీవు వన్నెరుంగవు. నేను నీ సోదరిని. నాపేరు చిత్తవృత్తి. నా కంటె వెనుక జన్మించుటవలన నీవు వన్నెరుంగవు నీవీ ప్రపంచములో ఏయే ఆశ్రమములు నీ నివాసయోగ్యములు కావని త్యజించివచ్చితివో వాటిఅన్నిటియందు నివసించుచు ఆ యాశ్రమము లన్నిటిని చాల శోభావంతముగా నొనర్చివచ్చితిని, నీ పనియేమి? అని అడిగితివి. సమాధానము చెప్పెద వినుము. సుందరమైన భోగముల ననుభవించుట, శ్రావ్యమైన గానములను వినుట, సౌందర్యవంతులగు పురుషులతో క్రీడించుట, సుగంధ ద్రవ్యములను నలదికొనుట, విలువగల వస్త్రములను ధరించుట, స్వాదుభోజనముల నారగించుట, అన్నివేళల సంతోషముగానుండుట, సాధ్యమైనంతవరకు విషయానంద మనుభవించుట, ప్రపంచములో యితర పురుషులకుకూడా విషయానంద మనుభవించవలసినదిగా ఉపదేశించుట యిదే నా ముఖ్యోద్దేశము. ఇపుడు నీవు నివసించదలచిన రమణీయమైన ఆశ్రమమునందే వుండవలయునని నా సంకల్పము. ఎందువలననగా ఇది నాకుకూడా చాలా భోగయోగ్యమైన ఆశ్రమము. చిత్తవృత్తియొక్క మాటలు విని వివేకాశ్రముడు "ఓ చిత్తవృత్తీ! ఈ ఆశ్రమము మిథ్యాభోగముల ననుభవించుటకు తగినదికాదు. స్త్రీపుత్రాదిభోగములు అనుభవించతగిన ఆశ్రమములు వేరు. ఈ ఆశ్రమము కేవలము ఆత్మానందము పొందుటకు ఏర్పరుపబడినది.

ఒకవేళ నీకు భోగములయం దాసక్తియున్నచో నేను త్యజించి వచ్చిన ఆశ్రమములయందే యుండి భోగ

సుఖముల ననుభవింపుము. ఎందుకనగా, యీ ఆశ్రమము ముముక్షుసన్యాసులకు లేక జ్ఞానులకు ఆత్మానందము నాస్వాదించువారికి తగినది. నీకుకూడా ఆత్మానందము పొంద యిచ్ఛ యున్నచో నీవద్దనున్న సుందరములైన వస్త్రభూషణములను విసర్జించి, శిరోముండనముగావించి నాతో నివసించుము.

చిత్తవృత్తి అంటున్నది. వివేకాశ్రమా? నీవలె నేనంత మూర్ఖురాలను కాను. నీవంటి మూర్ఖునివలె నేను కేశహీననై శూన్యమందిరములందు, స్మశానములందు తిరుగుచు స్వాదుహీనము, కల్పితమూ నగు ఆత్మప్రాప్తికొరకు దుఃఖముల ననుభవించుచు ప్రత్యక్ష ఆత్మను త్యజించి, అప్రత్యక్ష ఆత్మకొరకు పరుగులెత్తుట నామతముగాదు నేను ప్రత్యక్షభోగముల ననుభవించుచు వస్త్రభూషణములను ధరించుచు, సుగంధద్రవ్యములను రాచుకొనుచు, రకరకములగు రసభూయిష్టమైన భోజనము భుజించుచు, కోమలమైన పాన్పుమీదనుండి యెల్లప్పుడు విషయసుఖముల ననుభవించెద. ఇదే ఆత్మానందము. దీనినే స్వర్గసుఖ మనెదరు. ఎవరైతే యీ ప్రపంచములో ఇహభోగముల ననుభవించెదరో వారే స్వర్గలోక నివాసులని పిలువబడుదురు. ఇహసుఖములేని నీవంటి సన్యాసులు నరకవాసు లనబడుదురు. వెర్రివాడా? ఏ యిష్టదైవమునుగోరి తపస్సుచేయుదలంచితివో, వారే యిహసుఖము లనుభవించుట ఎరుగవా? అవివేకీ! స్వర్గసుఖ మననేమో ఎరుగుదువా! నీవు అవతారము లనుకొనువారును, యింద్రాదులును, త్రిమూర్తులును, పరాశరాది ఋషులును స్త్రీసుఖము లనుభవించిన వారతే

అని ఎరుగవా ? ఓ మూఢుడా! ఈ సన్యాసము ఎవరికొర కేర్పడినదో విచారించుము.

అగ్నిహోత్రం త్రయోవేదా స్త్రిదండం భస్మముండనమ్,
బుద్ధి పౌరుషహీనానాం జీవికా ధాతృనిర్మితా॥

అగ్నిహోత్రముచేయుట, వేదములుపఠించుట, ముండనము చేయించుట, దండము ధరించుట, బూడిదపూసుకొనుట యివన్నియు బుద్ధిహీనులకు పౌరుషములేని పురుషార్థహీనులకు నపుంసకులనిమిత్తము బ్రహ్మ సృష్టించెను. అంతేకాని విద్యావంతులకు ప్రజ్ఞావంతుల కేర్పడినవి కావు.

త్రయోవేదస్య కర్తారో ముని భాండ నిశాచరా.

కేవలము తపమేజన్మమునకు పరమార్థమని ఋషులును, ముక్కుమూసుకొని కూర్చుండుటయే ముక్తియని ఘటవాదులును, యజ్ఞ, యాగాది క్రతువులే జన్మసాఫల్యతకు సాధనములని రాక్షసులును వారివారి వాదముల కనుకూలములుగ వేదములను సృష్టించి వేదకర్తలైరి.

వివేకాశ్రమా! కష్టభూయిష్టములైన పనులు కల్పితమగు స్వర్గప్రాప్తికొరకు వ్రాయబడియున్నవి. యజ్ఞమున పశువులను చంపుటవలన స్వర్గప్రాప్తికలుగుచో యజమాని తన తండ్రిని యజ్ఞమున హోమమెందుకు చేయడు? అతనికికూడ స్వర్గము పొందవలెనను కోర్కె యుండునుగదా! యజ్ఞయాగాదులు చేసి మృతినొందినవారిలో యింతవర కెవరైన వచ్చి తమకు స్వర్గప్రాప్తికల్గినదీ లేనిదీ చెప్పియున్నారా? చనిపోయినవారికి పిండములు వదలుచున్నారు. అవి వారికి అందుచున్నవా? అట్లందుచున్నచో విదేశములకు పోవువారికి అన్నపిండములు వదలినచో అవియు వారికి ప్రాప్తికావలెనుగదా!

అన్వేషింపఁబడిన సిద్ధాంతములే. అనుభవించుటను జరుగుటలేదు. ఇవన్నియు స్వార్థుల జీవికా నిర్వాహణకొఱకేర్పఱుపబడిన సిద్ధాంతములే.

న స్వర్గో వాఽపవర్గో వా నైవాత్మా పారలౌకికః,
నైవ వర్ణాశ్రమాదీనాం క్రియాశ్చ ఫలదాయికాః.

వాస్తవముగా స్వర్గము, నరకము, మోక్షము కల్పితములు. పరలోకము పొందుటసత్యము. వర్ణాశ్రమధర్మములైన క్రియలద్వారా పారలౌకిక ఫలితము చేకూరుననుకొనుట అవివేకము.

యావజ్జీవేత్సుఖం జీవేదృణం కృత్వా ఘృతం పిబేత్,
భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః.

సుఖముగా జీవించుటయే మానవుని జీవితపరమావధి. సాధ్యమగు వఱకు యెట్టి కష్టములను అనుభవించక సుఖజీవనము చేయుటకే ప్రయత్నించవలయును. అట్టి సుఖజీవనమునకు తగిన పరికరములు తనవద్ద లేనిచో ఋణము చేసియైనను సుఖమును పొందవలయును. ఋణమెట్లు తీర్పవలయు నన్న ప్రశ్నకు హృదయమున తావీయవలదు. భస్మమైపోవు యీ శరీరము తిరిగి వచ్చుటయే లేనపుడు యింక ఋణమేమిటి ? తీర్పుటేమిటి ?

వివేకాశ్రమా ! ఈ నీ అసహ్యకరమైన రూపమును విసర్జించి నీ నిజరూపమును ధరించుము. ప్రాపంచికసుఖభోగముల ననుభవించుము. వ్యర్థముగ నీ నవయౌవనమును పాడుచేసికొనకుము.

వివేకుడు:—చిత్తవృత్తీ! అట్లనకుము. నీ తలంపులన్నియు భ్రమలుసుమా ! విధాత త్రిదండమును, సన్న్యాసమును, ఆత్మజ్ఞానప్రాప్తికి సాధనములుగ యేర్పరచియుంచెను. నీవు దానికి విపరీతార్థము తీయుచున్నావు. కామెర్లరోగికి ప్రపంచమంతయు

పచ్చగనే కనుపించుచుండును సుమా! కాన నీవే విపరీతబుద్ధులను త్యజించి ఆత్మజ్ఞానాసక్తమగు బుద్ధిని ఆశ్రయించుము.

చిత్తవృత్తి:- ఓయీ వివేకాశ్రమా! నీవు చెప్పు సిద్ధాంతము లేవియు వివేచనాయుక్తముగ లేవు. శాస్త్రములయందు చెప్పిన ప్రతిదానిని మూఢముగ నమ్మి నీ బోంట్లందరు ప్రత్యక్షవస్తువు ననుభవించలేక అప్రత్యక్షమగు సుఖముకొరకై జీవిత సర్వస్వమును కోల్పోయి, దేశద్రిమ్మరులై సంచరించుచుందురు. విధాత, వేదములు, సృష్టి అని పదేపదే వాపోవుచుందువేల? వేదములను, శాస్త్రములను సృష్టించిన దెవరో- ఏ కారణముచే నవి రచింపబడినవో నేను పూర్వమే నుడివియుంటిని. వేదకర్తలు శాస్త్రకర్తలు కుక్షింభరులై ప్రపంచమున ప్రతివాడు అనుభవించుచుండు సుఖమును సుఖమనక దానికి మించిన దేదో అలభ్యమగు ఆత్మానందము పొందుటకు ప్రాపంచిక సుఖములను త్యజించి, సర్వసంగపరిత్యాగమును బోధించి యున్నారు. దానినే నీవు విధాతసృష్టియని భ్రమపడుచున్నావు. నిజము తెలిసికొన్న యీ విధాతకూడ వీరిచే సృష్టింపబడినవాడేనని గ్రహించుము. శారీరకమగు సుఖదుఃఖములే వాస్తవమైనవి. వీటికిమించిన ఆత్మానందము మరొకటి లేనే లేదు. వివేకుడా! ఇప్పటికినీ మించిపోయినదేమియు లేదు. త్వరగ మేల్కొనుము. ఈ కృత్రిమ వేషమును త్యజించుము. ప్రాపంచికభోగముల ననుభవించుము. మూర్ఖుడవు కావలదు.

చిత్తవృత్తిమాటలకు వివేకునిముఖమున మందహాసము వెలువడెను. మనస్సున నిట్లనుకొనదొడగెను. ఈ మూర్ఖురాలు

త నొక్క పండితురాలుగ భావించుకొనుచున్నది. దుష్టమతి యగు నీమెకు సూక్ష్మదృష్టిచే చెప్పినచో ఫలము లేదు. ఎందు వలనన అసలే స్త్రీ, దానికితోడు చపల, పైగా విషయాసక్తు రాలు. కాన నీమెకు స్థూలదృష్టాంతములచే బోధించుట లెస్స! ఏ స్థాయిలోనున్నవారి కా స్థాయిలో చెప్పుటుత్తమము. అని తలంచి చిత్తవృత్తితో నిట్లనియె.

చిత్తవృత్తీ! మద్యపాన మొనర్చువానికి అమృతపు రుచి తెలియనట్లు, వేపచెట్టుననున్న పురుగు చెరుకురుచి యెరుగనట్లు, అసత్యవాది సత్యమువలన కలుగు ఫలితము నూహించలేనట్లు, వ్యభిచారిణి పాతివ్రత్యమహిమను తెలిసికొన లేనట్లు విషయాసక్తవగు నీవును ఆత్మానందము నెఱుంగ జాలవు. ఆత్మానందము లేశమైనను నీకు ప్రాప్తమగుచో నీవు విషయానందములను హేయదృష్టితో చూతువు! దీనినిగురించి దృష్టాంతముగ నీకొక కథ చెప్పెద వినుము.

1. ఒక చీమ ఉప్పుపర్వతముమీద వుంటూ వుండేది. మరొక చీమ పంచదారపర్వతముమీద వుంటుండేది. ఒక రోజు ఉప్పుపర్వతముమీదవుండే చీమ పంచదారపర్వతము పైన వుండే చీమవద్దకు వెళ్ళినది. ఆ చీమ సంతోషముగా వుండటంచూచి అడిగినది చెల్లీ! నీ ముఖము ప్రసన్నముగా కనుపించుచున్నది. నీ శరీరముకూడ చాల బలిష్ఠముగ కను పించుచున్నది. ఎల్లప్పుడు యీవిధముగా సంతోషముగ ఉండ టానికి నీ వేమి తింటున్నావు? రెండవ చీమ అంది. నేను పంచదారపర్వతముమీద వుంటున్నాను. ఇష్టము వచ్చినట్లు

పంచదార తింటాను. అందువలననే నా శరీరం నిరోగంగా వుంటుంది. నా మనస్సుకూడ ప్రసన్నముగా వుంటుంది. అపుడు ఉప్పుపర్వతముమీద వుంటున్న చీమ అంది. నేనుకూడ నీవలె సంతోషముగ వుంటాను. నాకుకూడ ఆ పంచదార పర్వతము ఎక్కడవున్నదో చెప్పు. నేనింతవరకు పంచదార మొగమైనా చూడలేను. ఇవాళ నీ నోటివెంట పంచదార మహాత్మ్యాన్ని వినేసరికి నాకుకూడ తినాలని వుంది. కనుక అది ఎచ్చటవుందో త్వరగా చెప్పు. అప్పుడా చీమ పంచదార పర్వతము ఎచ్చటవున్నదో చెప్పినది. వెంటనే రెండవచీమ పంచదార పర్వతముపైన తిరిగివచ్చి అంది. చెల్లీ! అది పంచదార పర్వతముకాదే! అది వుప్పుపర్వతమాయె! దానిమీద పంచదార పేరుకుకూడ కనుపించలేదు. అపుడు పంచదారపర్వతముమీద వుంటున్న చీమ మనసులో అనుకొనసాగినది. యీ చీమకు పంచదారపర్వతముమీద తిరిగివచ్చినప్పటికిని పంచదార దొరుకక పోవడానికి కారణమేమిటా అని అనుకొంటూ రెండవ చీమవైపు చూడసాగినది ఆ చీమనోట్లో ఉప్పుకళ్లొకటి కనుపించింది. వెంటనే పంచదార దొరుకక పోవడానికి కారణం తెలిసికొని ఆ చీమతో అంది. నీ వీ ఉప్పుకళ్లు పారవేయనంతవరకు నీకు పంచదార దొరుకదు. వెంటనే చీమ వుప్పుగల్లు పారవేసి మళ్ళీ పంచదారపర్వతంపైకి వెళ్ళింది. ఇప్పుడెందుకు పంచదార దొరుకదు! వెళ్ళగానే పంచదార దొరికినది. చిత్తవృత్తీ! ఇది దృష్టాంతము.

ఇక దార్ష్టాంతము విను. అంతఃకరణ మనే పర్వతం

వుంది. అందులో ఆత్మరూపమైన చక్కెర నిండియున్నది. విషయానందమనే వుప్పుగల్లు నోట్లో వుంచుకొని ఆపర్వతము మీాద రాత్రింబవళ్లు తిరుగుచున్నావు. కనుకనే, ఆత్మానంద రూపమగు చక్కెర నీకు ప్రాప్తించుటలేదు. ఎప్పుడైతే నీవు కూడ ఆచీమవలె విషయానందరూపమగు వుప్పుగల్లు పారవేసెదవో, అప్పుడే ఆత్మానందరూపమగు చక్కెరను పొందగలవు. చిత్తవృత్తీ! ఈప్రపంచములో స్త్రీలు, పుత్రులు, పౌత్రులు, ధనాదికములు అన్నియు బాహ్యసౌందర్యము కలవే. వాస్తవముగ నివన్నియు రమణీయములైనవిగావు. ఏలనన; యీ ప్రపంచములో వున్నవారు లేనివారు అందరు దుఃఖమనుభవించుచున్నారు. ఆలోచించిచూస్తే వీటన్నిటియందు సుఖము లేశమైనను లేదు. ఒకవేళ ఇవన్నియు సుఖప్రదములైయుంచో గొప్పగొప్పరాజులు, మహారాజులు వీటన్నిటిని యెందువల్ల త్యజించియుందురు? ఈ విషయమునుబట్టే స్త్రీ మొదలైన వస్తువులు దుఃఖప్రదములైనవని తెలియుచున్నది. చిత్తవృత్తీ! ఈవిషయమునే అనేక దృష్టాంతములద్వారా తెలిపెదను వినుము.

2. ఒకపట్టణములో ఒక బీదకోమటి నివసించుచూ వుండెను. అతనికొక భార్య, ఒక కుమారుడు వున్నారు. పుత్రుని ఐదవయేటనే తలిదండ్రులు మరణించిరి. అప్పుడా పిల్లవాని నెవరును ఆదరించేవారు లేకపోయిరి. ఒక మహాత్ముడా బాలుని చేరదీసి విద్యాబుద్ధులు గరపెను. ఇరువది సంవత్సరముల ప్రాయము వచ్చినతరువాత ఆ బాలుడు తన

గురువునద్ద తీర్థయాత్రకై అనుజ్ఞ పొంది బయలుదేరెను. ఒక గ్రామమునందు పెండ్లివారి వూరేగింపు చూచి అచ్చటి వారిని "ఇదేమి"? అని అడిగెను. అతడు పూర్వ మెపుడును ఇట్టి దృశ్యమును చూచియుండలేదు. పెండ్లివారు "యిది వివాహము" అని చెప్పిరి. కాని అతని కర్థముకాలేదు. మళ్ళీ యీ పల్లకీలోనున్న మనిషెవరు? అని ప్రశ్నించెను. గ్రామస్థుల, ఇతడు పెండ్లికుమారుడు; యితనిని తీసికొని పెండ్లికుమార్తెగారి ఇంటికి వెళ్ళుచున్నాము. అచ్చట యితనికిని మరొక స్త్రీకిని మేళతాళములతో వైభవముగ వివాహము జరుగును. అచటినుండి వారిద్దరు పెండ్లికుమారునియింటికివచ్చి ఒకే మంచముప పరుండి విషయానంద మనుభవించెదరు.

ఈ మాటలు విన్నపుడు అతనికిని వివాహము చేసికొనవలెననియు, స్త్రీతో విషయానంద మనుభవించవలెననియు సంకల్పము కలిగెను. ఆ విషయములనే ఆలోచించుచు అతడొక గ్రామమునకు చేరెను. అప్పటికి చీకటి పడుటచే దాపుననున్న నూతియంచున శయనించెను. నిద్రలో అతడొక కల గాంచెను. తానొక స్త్రీని వివాహ మాడినట్లును, ఆ స్త్రీని తన యింటికి తీసికొనివెళ్ళి ఆమెతో విషయానంద మనుభవించి నట్లును, కొంతసేపటి కామె తనను ప్రక్కకు జరుగమన్నట్లును గాంచి ప్రక్కకు జరుగగా జారి నూతిలో పడిపోయెను. దగ్గర నున్న ఇండ్లవారా శబ్దమును విని నిద్రనుండి లేచి పరుగిడి వచ్చిరి. ఎంతో కష్టముపై అతనిని పైకితీసి నిన్నెవరు నూతి లోనికి త్రోసిరని యడిగిరి. అపు డత డిట్లనెను. "నిద్రయంద

నే నొక స్వప్నము చూచితిని. అందొక స్త్రీతో రమించిన ట్లును, కొంతవడి కామె నన్ను ప్రక్కను ఒత్తిగిలి పరుండు మన్నట్లును, గాంచి ప్రక్కకుజరుగగా నే నీ నూతియందు పడిపోయితిని. ఆహా! ఎంత ఆశ్చర్యకరమైన విషయ మిది? స్వప్నములోని స్త్రీయే మనుష్యుని కూపమునందు తోయ సమర్థురాలైనచో జాగ్రదావస్థయందున్న స్త్రీ నరకకూప మందు పడద్రోయుటన్న ఆశ్చర్యమేమి!" ఇట్లని యాతడు తన దారినిపోయెను. తుదకు వివాహసంకల్పమును మాని, ఆత డొక బ్రహ్మవేత్త నాశ్రయించి జ్ఞానము బడసెను. చిత్త వృత్తీ! మానవుని అధోగతికి కొంపోవునది స్త్రీయే! స్త్రీ సాంగత్యమున గొప్పగొప్ప దేవతలు ఋషులుకూడ కుపథ గాములై పోయిరి. వివేకాశ్రమముని మాట కడ్డువడి చిత్తవృత్తి, 'అదేమి! దేవతలు మానవులకు పూజనీయులుగదా! వారు కూడ స్త్రీ సాంగత్యమున భ్రష్టులైరని నుడువుచున్నావు. అట్టి ఉదాహరణ లేవియైన నున్నవా?'

3. ఇది విని వివేకాశ్రము డిట్లనెను. చిత్తవృత్తీ! ఒకపుడు బ్రహ్మ తన చాకచక్యమంతయు నుపయోగించి సర్వాంగ సుందరయగు స్త్రీని సృజించెను. ఆమెయే మన పురాణము లందు చెప్పబడు "అహల్య". దేవతల సముఖమున ఆమెను గౌతమమహర్షి కిచ్చి వివాహము గావించెను. అహల్యా సౌందర్యమునకు ముగ్ధుడై దేవేంద్రు డామెను మోహించెను. యేవిధముగనైనను అత డామెను పొందగోరెను. ఒకనాటి యర్ధరాత్రమున గౌతముని మోసగించి నదీస్నానమునకు

పంపి. తాను గౌతమునిరూపమున అహల్యయొద్దకు చేరెను. పతి నారాధించుటకై పూజాసామగ్రిని సమకూర్చుచున్న యామెను సమీపించి "ప్రియా! కామదేవు డీ రోజు నన్ను తన పంచశరకములతో బాధించుచున్నాడు నా కోర్కె నెరవేర్చవా?" అని యడిగెను. సమయము గాని సమయమున పతి యీ విధముగ తన్ను పొందగోరుట చూచి, యామె చకితయై "స్వామీ! ఇది పూజాసమయము గదా! భోగించుట కిదియా సమయము! అనెను కాని ఇంద్రు డామె మాట లాలకింపకయే యామెను తన కౌగిట చేర్చుకొనెను. యింద్రు డీ విధముగ తన కోరిక నెరవేర్చుకొని వెళ్ళిపోవు నంతట, నదీజలమున స్నానమాడి గౌతముడు తిరిగివచ్చెను. తన రూపమునందున్న ఇంద్రునిగాంచి దివ్యదృష్టిచే జరిగిన వృత్తాంతమంతయు గనెను. ఇంద్రుడు అహల్యసహితముగ గౌతముని క్రోధమున శాపాహుతియయ్యెను. ఏ యోని సుఖమునుగోరి యతడు వచ్చెనో, అట్టి సహస్రయోను లాతని శరీరమం దంతటను కనుపించెను. అహల్య శాపభ్రష్టయై పాషాణరూపము దాల్చినది. చిత్తవృత్తీ! స్త్రీ సాంగత్యమువలననేగదా ఇంద్రు డట్టి దుర్దశకుపాలైనది! ఒకపుడు బ్రహ్మదేవునకును ఇట్టి దుర్దశ సంభవించినది. పద్మపురాణమం దీ విధముగ నున్నది.

4. ఒకప్పుడు రాక్షసరాజగు జలంధరుడు తన భార్య యొక్క పాతివ్రత్య ప్రభావముచే నిశ్చింతనిడిగ రాజ్యమును పాలించుచుండెను. అతడు చేయు ఘోరములిన్నియని చెప్పశక్యముగాకుండెను. ఒకప్పుడు దేవతలపై దాడి సలిపెను. దేవతల

కును రాక్షసులకును ఘోరముగ యుద్ధము జరుగుచుండెను. దేవత యెన్నియుపాయములచే నోడింప యత్నించినను విఫలులగుచుండిరి. ఎట్టి అస్త్రములు ప్రయోగించినను జలంధరుడు చావకుండెను. తుదకు దేవతలంతరునుకూడి దీనికంతకును కారణము జలంధరునిభార్యయొక్క పాతివ్రత్యమహిమ యని యూహించి, విష్ణువును యేవిధముగనైన యామె పాతివ్రత్యమును చెరుపవలసినదిగా వేడిరి. అప్పుడు విష్ణుమూర్తి జలంధరునిరూపమున బృందవద్దకు చనెను. ఆమె యతడు తన భర్తయే యని తలంచి యథావిధి సపర్యల నొనర్చి యాతని గూడెను. ఏ పాతివ్రత్యముచే యిప్పటివరకు తన భర్తను కాపాడుకొనుచుండెనో ఆ పాతివ్రత్యము భగ్నమగుటతోడనే యుద్ధము నొనర్చుచున్న తన భర్తశిరము తన పాదములకడ వ్రాలెను. అపు డామెకు నిజస్థితి గోచరమయ్యెను. తన సౌశీల్యమును మంటగలిపిన విష్ణువును ఆమె పాషాణముగ శపించెను. చిత్తవృత్తీ! స్త్రీలవలన ఎంతటి మహానుభావులు దుస్థితికిపాలైరో వివరించితిని. స్త్రీ ముక్తిమార్గమున కాటంకము. కనుకనే వివేకవంతులు వారిదరికి యెన్నటికినీ చేరరు. మరొక దృష్టాంతము వినుము.

5 వృద్ధుడగు బ్రాహ్మణు డొకడు గంగానదీతీరమున తపస్సు చేసికొనుచు డెడివాడు. నిత్యము తన తపోనిష్ఠలను పూర్తిగావించుకొని, తనయొద్దకు చే భక్తులకు ధార్మికవిషయములను బోధించుచుండెడివాడు. ఒకదిన మాతని కుటీరప్రాంగణమునుండి యౌవనము తొణికిసలాడు సుందరియొకతె తన

మందిరమునకు పోవుచుండెను. ఆమె మోహనరూపమును గాంచి వృద్ధబ్రాహ్మణుని మనస్సు చలించెను. ఆమెను వెంబడించుచు, యతడును ఆమె మందిరమువరకు చనెను. తన గృహమును చేరినపిదప యామె తన్ను వెంబడించుచున్న యాతనివైపు తిరిగి ఆర్యా! తామిట్లు వచ్చుటకు కారణమేమిటి? నావలన నేమైన యుపకృతి నొందగోరిన సెలవిండని పలికెను. ఆమె రూపమును చూచియే మోహావశుడైన యా బ్రాహ్మణున కామె మృదుమధురములగు పల్కులు అగ్నికి ఆజ్యముతోడైన చందముగ నాయెను. కామోద్రిక్తుడై యతడా సుందరిని తన బాహువులందు చేర్చుకొనజూచెను. వృద్ధుని యీచేష్టలనుగాంచి యామె చకితయై మహాత్మా! మీరు నాకు పితృతుల్యులు. నాపొందుగోరుట తమ కుచితముగాదు అని వినయముగపలికెను. కాని, కామోన్మత్తుడగు బ్రాహ్మణుడామె పల్కులను పెడచెవినిబెట్టి బలవంతముగ నామెను చెరుపబూని గృహమున ప్రవేశింప ప్రయత్నించెను. అపుడామె వివశయై ఆత్మరక్షణకొరకా బ్రాహ్మణునిశిరమును లోనికి రానిచ్చి రెండు తలుపులను బంధించెను. బ్రాహ్మణుని శిరస్సు తెగి భూమిపైబడెను. చిత్తవృత్తీ! స్త్రీరూపము చాల శక్తివంతమైనది. ఒక్కక్షణములో గొప్పగొప్పవారిని సహితము చంచలురను చేయగలదు. తప మొనరించు నొక వృద్ధునకే స్త్రీని చూచి చాంచల్యము గలిగెనన్న, ఉద్రేకపూరితములగు యువకులమనస్సులు నిగ్రహింపశక్యమా! ఘోరతపస్సునందు నిమగ్నుడైన విశ్వామిత్రుడే సౌందర్యవతి

యగు నొక అప్సరసనుచూచి తపోనిష్ఠల నావలద్రోసి భోగ విలాసములందు మగ్నుడై పోయెను. అతివేగముగ ప్రవహించు నదిని ఇసుకగను, పగటిని రాత్రిగనొనర్చిన పరాశరుడు సహితము కామమును జయించలేకపోయెను. దీనినే నీతి శాస్త్రము లిట్లు ఘోషించుచున్నవి.

విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబుపర్ణాశనాః
తేపి స్త్రీముఖపంకజమ్ సులలితమ్ దృష్ట్వైవ మోహంగతాః
శాల్యన్నమ్ సఘృతమ్ పయో దధియుతమ్ యే భుంజతే మానవాః
తేషామింద్రియనిగ్రహోయదిభవేత్ వింధ్య స్తరేత్సాగరే.

ఆకు అలములు భుజించి నిర్జనారణ్యములందు తప మొనరించు విశ్వామిత్రపరాశరాదులే స్త్రీనిచూచి చాంచల్యము పొందినపుడు, పంచభక్ష్యములను భుజించు మానవులు ఇంద్రియములను నిగ్రహింపగలరనుట వింధ్యా పర్వతము సముద్రము నీదుటవంటిది. స్త్రీ సంసర్గరహితుడే ఇంద్రియములను వశమునందుంచుకొనగలడు. ఆత్మపురాణమునందు కామప్రాబల్యమునుగూర్చి ఇట్లు చెప్పబడినది.

కామక్రోధౌ మహాశత్రూ దేహినామ్ సహజా ఉభౌ
తౌ విహాయపరం శత్రుమ్ యోజయేత్ సతు మందధీః.

ప్రాణులకు కామక్రోధములు సహజ శత్రువులు. ఈ శత్రువులను వదలి ఇతర శత్రువులను జయించువాడు వట్టి జడుడు.

పితా పుత్రౌ మహావీర్యౌ కామక్రోధౌ దురాసదౌ
విజిత్య సకలమ్‌విశ్వమ్ వర్తేతే జయశాలినే.

కామక్రోధములు పితాపుత్రులు ఇవి మిక్కిలి శక్తివంతములు. సమస్త విశ్వమును జయించి విరాజిల్లుచున్నవి.

కామేన విజితో బ్రహ్మ కామేన విజితోహరిః
కామేన విజితశ్శంభుః శక్రఃకామేన నిర్జితః.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు, ఇంద్రుడు మొదలగు మహాపురుషులు గూడ కామముచే నోడింపబడిరి. చిత్తవృత్తీ! ఇంద్రియములను నిగ్రహింప గల్గినవారే ఆత్మానందమును పొందగలరు. స్త్రీ సంసర్గముచే దుర్గతినొందిన వారి చరిత్రను వినుపించెదను వినుము.

6. రాక్షస వంశమునందు జన్మించిన సుందోపసుందులను యిరువురు సోదరులు గలరు. వారు మంచి బలపరాక్రమశాలురు. ఘోరతపస్సుచేసి బ్రహ్మచే తామితరులచే చంపబడకుండునట్లు వరము బడసిరి. అప్పటినుంచి వరగర్వితులై దేవమానవుల నందరను పీడించ మొదలిడిరి. ఇంద్రాదులచే వీరి దుశ్చేష్టలువిని బ్రహ్మ మారణోపాయము నాలోచించెను. వీరితరులచేమాత్రము చంపబడరుగాని పరస్పరము కలహించి మరణించుట కవకాశముగలదు. స్త్రీ మూలమునగాని వీరిరువురిలో కలహము సంభవించదని యూహించి అతడొక నవయౌవనయగు సుందరిని సృష్టించెను. ఆమె సుందోపసుందులున్న అరణ్యమునకు చనెను. ఆమె రూపలావణ్యమునుగాంచి వారిరువురికిని ఆమెయం దనురాగము గలిగెను. ఎవరికివారు తనను వివాహము చేసికొనవలసినదిగ వేడికొన మొదలిడిరి. అపుడా సుందరి సయుక్తికముగ వీరులారా! ఒక స్త్రీకి యిరువురు భర్తలుండు టెట్లుసంభవము? శక్తిశాలి ఎవరో వానినే నేను పతిగా స్వీకరించెదననెను. ఆమె పలుకుట తడవుగ వారిరువురు ద్వంద్వయుద్ధ మారంభించిరి. పరస్పరా ఘాతములచే

ఇరువురును మడసిరి. చిత్తవృత్తీ! యిట్లె అనేకమంది స్త్రీ సంసర్గమున దుర్గతిపాలైరి.

చిత్తవృత్తీ! అనేకమంది మహానుభావులు స్త్రీ సంసర్గమున దుర్గతి నొందిరి. పరస్త్రీనిగోరి అనేకులు భ్రష్టులైరి. పరస్త్రీరతే కష్టము లన్నిటికిని కారణముగాదు. భార్యయు తన సుఖమునుగోరియే భర్తను ప్రేమించుచున్నది. అట్లు కానిచో రోగపీడితులు, నిర్ధనులు, ఋణగ్రస్తులు, నపుంసకులైన వారిని గూడ ప్రేమించవలసి యున్నదిగదా? ప్రపంచమున నట్లెచ్చట నైన జరుగుచున్నదా? ఈ విషయమునుగురించియే ఆత్మ పురాణమునందిట్లు చెప్పబడియున్నది.

దరిద్రం పురుషం దృష్ట్వా నార్యః కామాతురా అపి;
స్ప్రష్టుం నేచ్ఛంతి కృణపం యద్వ చ్చకృమిదూషితం.

స్త్రీ కామాతురయైనను దరిద్రుడగు భర్త స్పర్శనుగోరదు. పురుగులు పడిన శవమును స్పృశించుట కెట్లు నిరాకరింతురో ఆమెయు నతని నట్లే నిరాకరించును.

బ్రహ్మాదిభ్యో వివాహేభ్యః ప్రాప్తా నారీపతివ్రతా
భర్తుర్దరిద్రస్య మృతిమ్ వాంఛతి క్షుధయార్దితా.

ధర్మశాస్త్రసమ్మతముగా వివాహము చేసుకొన్న భార్యయైనను క్షుధాపీడితయైనచో దరిద్రుడగు భర్త మరణమునే వాంఛించును. స్త్రీలు స్వసుఖమునకే భర్తను ప్రేమించుచున్నారుగాని భర్తసుఖముకోరకుగాదు.

దీనికొక దృష్టాంతరము చెప్పెదను వినుము.

7. ఒక పట్టణమున ధనికుని పుత్రు డొకడు ప్రతిదినము మహాత్ముల బోధలను వినుటకు పోవుచుండెడివాడు. తలిదండ్రులు

లిది చూచి కుమారుడు విరక్తుడై సన్యాసి యగునేమోయను భయముచే లావణ్యవతియగు నొక యువతితో వివాహము చేసిరి. పెండ్లియైనపిమ్మటకూడ వారికుమారుడు మహాత్ముల వద్దకు వెళ్లుట విరమింపకుండెను. అపు డతని తలిదండ్రులు కోడలికిట్లు బోధించిరి. నీభర్త మహాత్ములవద్దకు వెళ్ళకుండు నట్లు నీ వతనికి శుశ్రూషలు చేసి లోబరచుకొనుము. ఆమాటలు విని యామెయు వారు చెప్పినట్లుగనే శుశ్రూషలు చేయ మొదలిడెను. క్రమక్రమముగా వారనుకొనినట్లే యువకుడు మహాత్ములయొద్దకు వెళ్ళుట తగ్గించెను మొదట ప్రతిరోజును వెళ్ళుచుండెడివాడు. ఇపుడు రెండుమూడుదినముల కొకసారి పోవ మొదలిడెను. ఒకరోజాతని భార్య భర్తలోని, యీ మార్పును గ్రహించి పూర్తిగ మహాత్ములయొద్దకు పోవుట మాన్పింపదలంచి యతనితో యిట్లన్నది. స్వామీ! మీరిట్లు రాత్రిసమయములందు నన్నొంటరిగ వదలి యెచటికో పోవుచున్నారు. గృహముందు స్త్రీలు వొంటరిగ నుండుట మంచిదికాదనెను. ఆమె చెప్పిన ప్రకార మతడు ఆరోజునుంచి వెళ్లుట పూర్తిగమానివేసెను. ఒకనాడొక మహాత్ముడు కనుపించి అతనిని రాకపోవుటకు కారణమడిగెను. యువకు డపుడు మహాత్మునుద్దేశించి పలికెను. స్వామీ! సేవా శుశ్రూషలచే నాభార్య నన్ను చాలా ప్రసన్నుని చేయు చున్నది. ఆమె సాన్నిధ్యమున నే నెంతయో సుఖమనుభవించు చున్నాను. రాత్రిసమయములందు నేను లేసిదే ఒక ఘడియ యైనను ఒంటరిగ నుండజాలదు. ఆమెజేయు ప్రతిపనియు నా సుఖము నపేక్షించియే చేయునపుడు నే నామెను క్షణము

కూడ వదలియుండుట భావ్యముగ తలంచుట లేదు. ఆకారణము వనే నేను మీవంటి మహాత్ములయొద్దకిపుడు రాజాలకున్నాను. అదివిని మందహాసముతో మహాత్ము డిట్లనెను. సోదరా! నీ భార్య నీ వనుకొన్నట్లు నీ సుఖమునపేక్షించియే అట్లు చేయుట లేదు. తనసుఖముకొరకే అట్లు చేయుచున్నదని గ్రహింపుము లోకములో నిది సహజముగ జరుగుచుండు నదియే! నేను చెప్పునది నీ కిపుడు విశ్వసింపదగినవి లేకున్నచో నిరీక్షించుచుండుము. సమయమే నిర్ణయింపగలదు ఇట్లని మహాత్ముడు తనమార్గమున తాను పోయెను.

కొంతకాలము గడచినది. వ్యాపారమునందా యువకునకు అమితమైన నష్టము గలిగినది. తన యాస్తినంతయు ఋణదాతల కిచ్చివైచినను ఋణము తీర లేదు. వారా యువకుని నిర్బంధింప మొదలిడిరి. ఈ అవమానమును భరించ లేక అతడు తన భార్యయొద్దకుపోయి ప్రియే! యీ కష్టసమయమున నీవే నాకు తోడునీడవు. ఇంతవరకును నీవునాకు సుఖమునే చేకూర్చు చుంటివి. ఇపుడు వారి ఋణమెటులయినను తీర్చకుండిన నాకు కారాగారము తప్పదు. నీ వద్దనున్న ఆభరణములను నా కిమ్మని ప్రార్థనపూర్వకముగ వేడెను. పతియొక్క దీనా వస్థను గమనించక ఆమె తన భూషణములనీయుటకు నిరాకరిం చెను. మహాత్ముని మాటలపుడు శంఖధ్వనివలె కర్ణపుటములందు ఘోషించ మొదలిడెను. వెంటనే తనగృహమును, గృహోపకరణ ములనన్నింటిని ఆ ఋణదాతల కిచ్చివైచి సన్యాసమును పరిగ్రహించెను.

చిత్తవృత్తీ! భార్య ఒక్కతేయే యననేల. భార్యా పుత్రాదులతోగూడిన యీ సంసారమే దుఃఖభూయిష్టమైనది. ఈ బంధనమునుండి విడువడుట మనుష్యునకు దుస్సాధ్యము. ఈ విషయమునుగురించి శుకమహర్షి వ్యాసమహర్షితో చెప్పినదిచూడుము.

కదాచి దపి ముచ్యేత లోహ కాష్ఠాది యన్త్రితః
పుత్ర దారై ర్నిబద్ధస్తు న విముచ్యేతకర్హిచిత్.

ఇనుప సంకెలలైనను ఒకప్పుడు తప్పించుకొనవచ్చును గాని భార్యా పుత్రాదులను మోహమనెడి సంకెలనుండి పురుషుడెన్నటికి తప్పించుకొన జాలడు.

అధీత్య వేదశాస్త్రాణి సంసారేరాగిణశ్చయే
తేభ్యః వరా న మూర్ఖోఽస్తి స ధర్మా శ్వాశ్వ సూకరైః.

ఏ పురుషుడు వేదశాస్త్రములు పఠించియు కేవలము స్త్రీ పుత్రాదులందే ఆసక్తుడగునో వానికంటె మూర్ఖులు యీ ప్రపంచములో మరెవ్వరు వుండరు. ఏలనన వేదశాస్త్ర జ్ఞానమెరుగని కుక్క, గుఱ్ఱము, పంది మొదలగు క్రిమికీటకాది తిర్యగ్జంతువులన్నియు అట్లే వాటి బిడ్డలయందు ఆసక్తి గలిగివున్నవి.

గృహ్ణాతి పుంసంయస్మాద్ గృహంతే న ప్రకీర్తితమ్
క్వసుఖం బంధనాగారో తేన భీతోఽస్మ్యహం పితః.

శుకమహర్షి ఓ తండ్రీ! యే కారణముచే పురుషుడు గృహస్థాశ్రమము స్వీకరించుచున్నాడో ఆ కారణముచేతనే దాని నామము గృహమని పెట్టబడినది. గృహస్థాశ్రమమను యీ జైలుఖానాయందు సుఖమెచ్చటగలదు!

మనుష్యం దుర్లభం ప్రాప్య వేదశాస్త్రాణ్యధీత్యచ
బధ్యతే యది సంసారే కో విముచ్యేత మానవః.

దుర్లభమగు మానవశరీరము ధరించి శాశ్వతానందప్రదమగు మోక్షమును పొందుటకై ప్రయత్నింపనివాని జీవితము నిరర్థకమేగదా! వేదశాస్త్రములు చదివియు సంసారబంధనమున బంధితుడైనచో యీ సంసారసాగరమునుండి యే యితరప్రాణులు బయటపడగలవు?

దీనినిగురించి ఒక కథచెప్పెద వినుము.

8. ఒకపట్టణమున ఒక అంధుడు భిక్షాటనము చేసుకొనుచు కాలముగడుపుచుండెను. ఆ పట్టణము నాలుగైదు మైళ్ళు విస్తీర్ణముగలిగి చుట్టు యెత్తుగల ప్రహరివుండెను. ఆ ప్రహరీకి యెనుబదినాలుగులక్షల ద్వారములుండెను. అందులో ఒక సింహద్వారముమాత్రమే తెరచివుండి మిగతా ద్వారములన్నియు బంధింపబడియుండెను. ఇట్లుండగా కొంతకాలమునకు ఆ గ్రుడ్డివానికి భిక్షాటనము జరుగక మరొక పట్టణముపోదలచి దారిచూపుమని కొందరినడుగగా ఆ ప్రహరి దూరముగావుండుటచే ఎవరును సింహద్వారము చూపకుండిరి. కట్టకడకు ఒకరు ఒక వుపాయమును చెప్పెను. అదేమన సింహద్వారము చూపవలెనంటె చాల కష్టముగాన నీకు ప్రహరిగోడనుచూపెదను. నీవు దానినిపట్టుకొని నడచినచో యెచ్చట సింహద్వారము దొరకిన అచ్చట దాటివెళ్ళుమని చెప్పి అంధుని తీసుకొనివెళ్ళి ప్రహరీగోడను అందించెను.

ఈ విధముగా అనేకకష్టములు పడి నడచుచు కొన్ని దినములకు సింహద్వారము సమీపించగా అతని వీపుయందు తామరవుండి అది దురదరేగగా ఆ గోడయందు వుంచిన చేయి తీసి గోకుకొన నారంభించెను. నడచుట మాత్రము

మానలేదు. ఇంతలో ద్వారము తప్పిపోయెను. దురద ఆగి యథాప్రకారము గోడయందు చేయివుంచి నడచుట ప్రారంభించి సింహద్వారము గానక తిరిగితిరిగి అనేక దుఃఖములను పొంది కడకు ఆ పట్టణమునందె మరణించెను. అదేవిధముగా యెనుబది నాలుగు లక్షల యోనులచే నిర్మింపబడిన ప్రహరీ గల యీ ప్రపంచమను పట్టణమునందు జీవుడు యెన్నియో జన్మములందు చేసిన పుణ్యపరిపాకముచే దుర్లభమగు మానవ శరీరమనే సింహద్వారము సమీపించి మోక్షమను పట్టణము చేరుటకే ప్రయత్నింపక దారాపుత్రాదులే నిత్యమని విషయ సుఖములనే తామర గోకుకొనుచుండినచో అంధుని గతియే యీ జీవునికి పట్టి యెనుబది నాలుగు లక్షల యోనులయందు తిరుగుచు పంకిలమునబడి నరకకూల పురుగువలె అపారదుఃఖమును పొందుచుండును. ఇట్టి వాక్యములను నుడివి శుక మహర్షి అరణ్యమునకు జనెను.

ఎవరు కాలముయొక్క విలువయు, సంసారముయొక్క దుఃఖమును, ఆత్మయొక్క ప్రభావమును, జ్ఞానముయొక్క సుఖమును, యెంతవరకు తెలిసికొనరో అంతవరకు తాము విరక్తులమనియు భక్తులమనియు జ్ఞానులమనియు తలచినను ముక్తులు గాజాలరు.

మానవులు నాలుగు రకములు. నారాయణస్మృతి.

బ్రహ్మనిష్ఠ పరో దేవః॥ అనగా దైవార్పిత హృదయము గలవాడై వహానిని మానవ దేవుడని మహర్షులు చెప్పియున్నారు.

సత్యధర్మ రతోమర్త్యః॥ సత్యధర్మములతోఁగూడి ధర్మ పత్నీ సమేతుడై యౌవనకాలమందు మాత్రము గృహస్థధర్మ మందుండి అనంతరము వానప్రస్థాశ్రమము స్వీకరించువారు మానవశ్రేష్ఠులు.

మద్యపానరతో దైత్యః॥ మద్యపాన ప్రియుడై మరణమువరకు ఇంద్రియసుఖముల ననుభవించుటయే ముఖ్యోద్దేశమని చెప్పువాడు మానవాసురుడు. మాంసాశీచ నీచాచారః॥ జంతువులజంపి తినుటయం దాసక్తుడై దానియందు పాపములేదని చెప్పువాడు మానవరాక్షసుడు.

హేచిత్తవృత్తీ! ఎట్లు స్త్రీసమస్తదుఃఖములకు కారణమో అట్లే పుత్రుడుకూడా దుఃఖమునకు కారణమగును. దీనిని గురించి నీకొక ఇతిహాసమును చెప్పెదను వినుము.

9. ఒక గ్రామమున ఒక వర్తకుడుండెను. అతనియొద్ద చాల ధన ముండెను. కాని పుత్రులులేరు. పుత్రప్రాప్తికి అనేక ప్రయత్నములు చేసినను సంతానము లేకపోయెను. ఆ వర్తకు డొకనాడు తన భార్యతో మంచముపై పరుండియుండ కొంత సేపటికా స్త్రీ భర్తతో ఇట్లనెను. నాథా! భగవంతుడు మన కొక పుత్రుని ప్రసాదించినచో వానిని యెచట పరుండ పెట్టెదరని అడిగెను. వర్తకు డపుడు కొంచెము ప్రక్కకు జరిగి యీ ఖాళీయందు పరుండబెట్టెదననెను. మరొక పుత్రుని ప్రసాదించినచో, యెచట పరుండబెట్టెదరు, ఈసారి వర్తకుడు మరికొంత స్థలము ఖాళీచేయుటకై వెనుకకు వత్తిగిలెను. ఖాళీలేక క్రిందపడి మోకాలు విరిగెను. అప్పుడు ప్రక్కవా

రకుదెంచి యేల నీకాలు విరిగినదని అడుగుగా వర్తకు డిట్లు చెప్పెను. పుత్రులుపుట్టకయే నాకీగతి పట్టినది. పుట్టినచో యింకెన్ని యిక్కట్లు తెచ్చిపెట్టునోనని పుత్రపరితాపము మానెను.

హేచిత్తవృత్తీ! స్త్రీ పుత్రు లిరువురు దుఃఖమునకు కారణమైనను పుత్రులు రెండు విధముల దుఃఖమునకు కారణ మగుదురు. పుత్రులులేనివారు పుత్రులున్నవారిని చూచి చింతించుచుందురు. పేదవారికన్న ధనికులకే పుత్రశోక మధికము. పుత్రశోకమువలననే వారు కృశించిపోవుదురు ఒకవేళ ధనవంతులకు పుత్రులు గల్గినను పుత్రుడు మరణించి నతనే వారుకూడా ప్రాణములను కోల్పోవుదురు. పుత్రులు గల్గియు కుపుత్రులయినచో అట్టివారికి పుత్రులులేనివారికంటె సంతాప మధికము. ఒకవేళ సుపుత్రు డగుచో తలిదండ్రులు అతడు జీవించునోలేదోనని చింతగల్గివుందురు. పుత్రుని మోహ చింత అధికము. వివాహ మగుచో మనుమలుచింత. కాబట్టి హే చిత్తవృత్తీ! యీలోకమునందే పుత్రశోకము వీడనిచో మరణానంతర మెట్లు వీడగలరు. పుత్రులు కేవలము తండ్రి సంపాదించిన ధనము పంచుకొనుటకే జన్మింతురు. దీనిని గురించి నీకొక వృత్తాంతము చెప్పెదను వినుము.

10. ఒకగ్రామమునందొక షాహుకారుండెను. అతనికి అయిదుగురు పుత్రులుండెను. షాహుకారు ముసలివాడైనంతనే పుత్రులు ధనమంతయు పంచుకొని పిమ్మట తండ్రిని ద్వారము వద్దవుండి యెవరిని లోనికి రానీయకుమని చెప్పి భోజనము వంటయింటియందు తినునట్లు ఆజ్ఞాపించిరి. తండ్రి అట్లే

అంగీకరించి కొంతకాలము గడచినతరువాత భార్యలు తమ భర్తలతో యిట్లు చెప్పసాగెను. ఈవృద్ధపిశాచము వంట యింటియందు ద్వారమువద్ద వుమ్మి వేయుచు చూచేవారికి అయిష్టము గలుగునట్లు మలినపరచుచున్నాడు. వీనిని ధాన్యపు కొట్టుపై గదియందుండునట్లు చేసినచో బాగుండునని చెప్పిరి. అతనికి ఒక గంటకూడ యిచ్చినచో వానికి ఆకలి యగునపుడు ఆ గంట మ్రోగించిన మేము భోజన మచటికే తీసుకువెళ్ళి పెట్టెదమనిరి. ఈ సలహా బాగున్నదని ఒక గంటనిచ్చి పై గదియందుండునట్లు ఏర్పాటుచేసిరి. కొంతకాలము గడచిన పిదప ఆ వృద్ధుని మనమ డా మిద్దిమీదికి వెళ్ళి ఆ గంటతో ఆడుకొనసాగెను. మనమడు యొక్క ఆటలకు సంతోషించు చుండ ఇంతలో మనమడు ఆ గంట తీసికొని క్రిందికి దిగి పోయెను. వృద్ధుడు ఆకలియగునపుడా గంట వెదుకగా ఆగంట కనబడక కేకలు వేసివేసి దుఃఖింప సాగెను. ఆ కేకలు క్రిందికి వినరాకుండెను. కుమారులు వ్యాపారమునకై గ్రామాంత రము వెళ్ళిరి. వృద్ధు డాకలిచే మలమలమాడి రెండవరోజున మరణించెను. పుత్రులు ఇంటి కరుదెంచి భార్యలను తండ్రిగారికి భోజనము పంపుచున్నారాయని యడుగగా భార్యలు యిట్లు చెప్పిరి. గంట మ్రోగించుటలేదు. వారి కాకలివున్నట్లు కనుపించదనిరి. పైకి వెళ్ళిచూచిన తండ్రి మరణించివుండెను. చిత్తవృత్తి యెన్ని యిక్కట్లుకుపాలై ఆవృద్ధుడు ధన మార్జించి యిచ్చెనో తుదకీ పుత్రులక్రూరకార్యము చేతనేగదా అతడట్లు దుర్మరణము పొందుటకు కారణము,

మరొక వృత్తాంతము వినుము.

11. ఒక గ్రామమున ఒక వృద్ధుడుండెను. ఒకనాడతని మనమడు ఏ కారణముచేతనో ఆ ముసలివానిని తన్ని యింటి నుండి వెడలగొట్టెను. వృద్ధుడు ద్వారమువద్ద యేడ్చుచు మనమని తిట్టుచుండెను. ఆ సమయమున ఒక మహాత్ముడు ఆ దారివెంట వచ్చుచు యెందుకు యేడ్చుచున్నావని ముసలివాని నడిగెను. మహాత్మా నా వద్దనున్న ధనమంతయు తీసుకొని మనమలు నను కొట్టిరి. అందుకు ఏడ్చుచున్నాననెను. అపుడా మహాత్ముడు చెప్పసాగెను. నాయనా? వీరందరు తమ తమ సుఖాభిలాషులే కాని నీకు సుఖము చేకూర్చువారు కారు. నీవు వీరికి సుఖము చేకూర్చునంతవరకు నిన్ను ప్రీతితో చూచిరి. ఇపుడు నీయందు వారికి సుఖము చేకూర్చు యోగ్యత లేదు. ఇక నిన్ను ప్రేమింపరు. కాన నీవు నావెంట రమ్ము. ఉన్న సమయము పరమేశ్వరుని భజించి పరలోకసుఖము ప్రాప్తించ గలదని చెప్పగా వృద్ధుడిట్లనెను. నీ శ్రీరంగనీతులు కట్టిపెట్టు చాలుచాలు వెళ్ళు అని ఎందరు ప్రపంచములో యిట్లు బాధ పడుటములేదు? పిల్లలు కొట్టినంత మాత్రమున యిల్లు వదలి నవా రెవరయిన వుందురా పిచ్చివాడా? తాత మనమల మధ్య నీతీర్పెందుకు? ప్రపంచములో లేనిది నాకు రాలేదు. వెళ్ళువెళ్ళు అని కఠినముగా పలికెను. అపుడా మహాత్ముడు మనస్సునందిట్లనుకొనసాగెను. ఇట్టి దుర్దశ సంభవించియు మూర్ఖులు తమ బంధుమిత్రుల గృహద్వారము వీడజాలకున్నారని వెడలిపోయెను.

హే చిత్తవృత్తీ? యీ విషయమును గురించి ఒక యితిహాసము చెప్పెద.

12. ఒక గ్రామమున ఒక ధనికునకు నలుగురు కుమారులుండిరి. కుమారులందరు వ్యాపారము చేయుగలయోగ్యత గలిగినంతనే వారికి కొంతధనము పంచిపెట్టి వేరువేరు దుకాణములు పెట్టుకొనునట్లుచేసి ఆతనున్న గదియందు కొంతధనమును ఆ గోడలయందు దాచి పైన సున్నమువేసి గచ్చు చేయించెను. కొంతకాలమున కతనికి జబ్బుచేసి నోటివెంట మాటరాకుండెను. చుట్టుప్రక్కల వారంతా అతనిని చూచుటకు వచ్చిరి. అంత్యదశ సమీపించినదని యూహించి వారా ధనికునితో నీకు అంత్యసమయము వచ్చినదిగాన నీ ఆత్మశాన్తి కొరకు ఏదైనా దానముచేయుట నీకు అత్యవసరమని చెప్పిరి. అపుడా ధనికుడు నోటిమాటరాక గోడలవైపు చూపించెను. అతనియుద్దేశ్యము ఆ గోడలలోనిధనముతీసి దానముచేయవలసినదని. ఈ సంగతి అతని కుమారులు గ్రహించి వచ్చినవారితో యిట్లనిరి. మాతండ్రిచెప్పునదేమనగా నావద్దధనము లేదు, వున్న ధనమంతయు ఆ గోడలకే ఖర్చుఅయినదని చెప్పుచున్నాడనిరి. వచ్చినవా రందరు యీ మాటలు నమ్మిరి. ఇదివిని ఆ ముసలివాడునెత్తిని బాదుకొనుచు యేడ్వసాగెను. అప్పుడు కుమారులు తండ్రీ నీవు దుఃఖింపవద్దు. మేము కార్యమంతయు శుభముగా నెరవేర్చగలమని కుమారులు తండ్రికిచెప్పిరి. ఇంతలో తండ్రి ప్రాణముపోయెను.

హే చిత్తవృత్తీ! ఏ పుత్రులకొరకు మానము లక్షలకొలది ధనము సంపాదించి వారికొసంగుచున్నామో సంపాదించు వారిగతి యిదియే. అయినను మూర్ఖులు పుత్రమోహము వీడజాలకున్నారు.

దీనినిగురించి యొక దృష్టాంతరము వినుము.

13. ఒకపుడు నారదుడు తన శిష్యుడగు తుంబురుని వెంటనిడుకొని భూలోకమున పర్యటనముచేయుచు ఒక పట్టణమునందొక రావిచెట్టుక్రింద విశ్రమించిరి. ఆ చెట్టుకెదురుగా ఒక కోమటి దుకాణముండెను. ఆ దుకాణము ప్రక్కగా ఒక కసాయివాడు మేకలుతోలుకొని వెళ్లుచుండెను. అందులో ఒక మేక యీ కోమటిదుకాణముయందు ప్రవేశించి ధాన్యపు రాశియందు గింజలను తినుచుండెను. అపుడా కోమటి దాని నోటియందుగింజలను తీసుకొని ఆ మేక మెడపట్టుకొని కసాయివాని కప్పగించి దీనినికోసినరోజు దీనిమాంసము కొంత నా కిమ్మనిచెప్పి పంపెను. ఇదంతయువినుచు నారదుడు నవ్వెను. నారదుడు నవ్వుటకు కారణమేమని తుంబురుడు ప్రశ్నించెను. నారదుడు తుంబురున కిట్లు చెప్పెను. ఈ దుకాణమునందు ప్రవేశించి ధాన్యముతిన్నమేక పూర్వజన్మమందు యీ కోమటికి తండ్రి అందుచేతనే దుముకుచు దుకాణమునందు ప్రవేశించినది. దానినోటపట్టిన గుప్పెడు ధాన్యము తిననీయక దానిమాంసముకూడా యిమ్మని అడిగెను. ఏ కోమటి దేవతను ప్రార్థించి ఏ పుత్రులబడసెనో ఆ పుత్రుడే పిడికెడు అన్నముకూడా తిననీయకపోయెను. ఏ పుత్రులవల్ల లేశమాత్రమైనను సుఖముచేకూరదో ఆ పుత్రులకొరకే తపస్సుచేయుదురు. దీనికంటె అజ్ఞాన మింకేమున్నది.

14. ఒక మహాత్ముడు తన శిష్యులను వెంటనిడుకొని భిక్షకై ఒక శెట్టి దుకాణమునకువెళ్ళి భిక్ష పెట్టవలసినదిగా

కోరెను. ఆ శెట్టిచుట్టు వెండి బంగారము వజ్రవైడూర్యములు రాసులుగా పోసివుండెను. ఒక నౌకరునిపిలిచి వారందరికి భిక్ష నొసంగుమని చెప్పి లోనికి వెళ్ళి భిక్ష జేయుచుండెను.

అపు డొక శిష్యుడు మహానీయుని ప్రశ్నించెను. స్వామీ! మీరు ప్రపంచమున నెవరు సుఖపడువారు లేరను చుందురు గదా! యీ శెట్టి ఎంత సుఖపడుచున్నాడో చూడండి? ఇతని చుట్టూ లక్ష్మి నృత్యము చేయుచున్నది. వెళ్ళునపుడు మీరు కుశలము అడగండి. భోజనానంతరము శెట్టి నుద్దేశించి నీవు చాలా సుఖవంతుడవలె కన్పట్టుచున్నా వని మహానీయుడడిగెను. శెట్టి యేడ్చుచు నావంటి దుఃఖితుడు యీ ప్రపంచములో మరెవ్వరును లేరు. పరమేశ్వరుడు నాకు చాల ధనమొసంగెను గాని పుత్రులు లేని కారణముచే యీ ధనమంతయు వ్యర్థమేకదా? నా తరువాత యీ ధనమంతయు యెవరిపాలగునోనని దుఃఖముగలిగి వున్నాననెను. మహాత్ముడు శిష్యునితో నీవు యీ శెట్టి సుఖపడుచున్నాడంటివే అందరి కంటె దుఃఖముగలవా డితడేనని అచటినుండి మహాత్ముడు వెడలిపోయెను. హే చిత్తవృత్తీ! పుత్రులు కలిగినను దుఃఖమే. పుత్రసంబంధమగు కోర్కెలు దుఃఖమునకే కారణము. ఇట్టి కోర్కెలను త్యజించుటే వివేకవంతుని లక్షణము.

సుఖమిచ్ఛంతి యేమూఢా నేచ్ఛంతి సుఖకారణమ్
నేచ్ఛంతి దుఃఖలేశం వా తద్ధేతో స్సతతం యతాః.

తా॥ మూఢులగు మానవులు సర్వదా సుఖమునే గోరుచున్నారు గాని యే యనుష్ఠానముచే సుఖముగలుగునో యా విచారముమాత్రము

చేయరు. దుఃఖము కించిత్తైనను గోరరుగాని దుఃఖకరమగు తాపత్రయము నందే తిరుగుచుందురు. ఆహా! యేమి ఆశ్చర్యము.

హే చిత్తవృత్తీ! పుత్రులేకాక ధనముకూడా అనర్థములకే కారణము.

15. ఒకప్పుడు నలుగురు మనుష్యులు ఒకమార్గమున పోవుచుండగా ఆ మార్గమందొక వరహాలమూట లభించెను. ఒకతోటయందు చేరి వారునలుగురు పంచుకొనతలంచి తోటలో ప్రవేశించి పంచుకొంటూ ఆకలిబాధగలిగి ఒకడు రెండురూపాయిలు తీసుకువెళ్ళి ప్రక్కగ్రామమున మిఠాయి తెచ్చెదమని యిద్దరు మిఠాయికొరకు వెళ్ళిరి. వెళ్ళుచు వారు ఆ మార్గమున ఒకసలహా నాలోచించిరి. మన మీ మిఠాయియందు విషము కలిపి తీసుకువెళ్ళినచో ఆ మిఠాయితిని వారిరువురు మరణించెదరు. మనమిద్దరము ఆ ధనము పంచుకొందమని విషముకలిపి తీసుకువెళ్ళిరి. వీరిచట యిట్లాలోచించగా అచట వారిరువురు మరొక యాలోచన గావించిరి. అదేమన వారు వచ్చుటతోడనే వారిద్దరిని కాల్చివేసినచో ఆ ధనమంతయు మనమిద్దరమే పంచుకొనవచ్చునని వచ్చినతోడనే వారిని కాల్చిచంపిరి. తరువాత వారిరువు ఆ మిఠాయినితిని మరణించిరి. హే చిత్తవృత్తీ ? ఈ ధనమునుగురించి యెందరో హతులగుచున్నారు. ధనమేగాదు. రాజ్యములుకూడా దుఃఖములకే కారణమగుచున్నవి. ముందు రాజునకే శత్రువులవలన భయము గలుగుచుండును. రాత్రింబగలు రాజులు నిద్ర నెరుంగక చింతించుచుందురు. రాజ్యకాంక్షచే భ్రష్టులయిన వారిని కొందరిని ప్రమా

ణముగా చెప్పెదను వినుము. కైక తన పుత్రునికి రాజ్యకాంక్షచే సవతి కుమారుడగు రాముని పదునాలుగేండ్లు అరణ్యముల పాలు చేసినది. రాజ్యలోభముచే సుగ్రీవుడు సోదరుడగు వాలిని చంపించెను కంసుడు శత్రుభయముచే దేవకీసుతులను హత్యచేసెను. దుర్యోధనుడు రాజ్యలోభముచేతనే తన వంశజుల నందరిని పరిమార్చెను. రాజ్యకాంక్షచే తుదకు నరక భోగముల ననుభవించవలసి వచ్చును. ఈ రాజ్యము అనేక అనర్థములకు కారణమని స్వీకరించుటయే మానివేసిరి. కొందరు స్వీకరించినను అనంతరము దానిని త్యజించిరి. అట్టివారివి రెండు మూడు కథలను చెప్పెద వినుము.

16. ఒక దేశమున ప్రియవ్రతుడను రాజు చాలకాలము రాజ్యముపాలించి ఒకరోజు తనఅంతఃప్రబోధమువిని యిట్లాలోచించెను. ఆహా! యీ దుఃఖభూయిష్టమగురాజ్యము సుఖమపేక్షించి స్వీకరించితినిగాని దీనిఅనర్థములు తెలియలేక అమూల్యమగుకాలమువ్యర్థముచేసి యింద్రియసుఖములకులోనై అవిద్యాపూర్ణమగు నరకకూపమునబడిపోతిని. కామవశమున నేను నా భార్యకు దాసుడనైతిని. బాలకులకు వస్త్రహిరణ్యము లెట్లు ఆటవస్తువు లగుచుండునో అట్లె నేనును నా భార్యకు ఆటవస్తువునై రాజభోగములందు నా అమూల్యమగు ఆయువును వ్యయపరచితిని. వుత్తమమగు మానవశరీరము ధరించి మిథ్యాభోగములకై సమయమునంతను వ్యయపరచిన నాకంటె మూర్ఖులింకెవరు? ఇపుడైనా నేనీ రాజ్యము త్యజించి ఏకాంతప్రదేశమునందు ఆత్మచింతన గావింతునని యాలోచించి ప్రియవ్రతుడగురాజు రాజ్యమును పుత్రులకు వశపరచి

వనమునకరిగి ఆత్మచింతనగావించి ముక్తిని పొందెను. హే చిత్తవృత్తీ! రాజ్యము సుఖప్రదమగుచో ప్రియవ్రతుడు రాజ్యము నేల త్యజించును ?

**17.** కృతవీర్యుడనురాజు చాల ధర్మాత్ముడు. చాల కాలము రాజ్యము పాలించి దివంగతుడగుటకు పూర్వము తన కుమారుడగు అర్జునునికి రాజ్యాభిషేకము చేయదలంచి మిత్రులను ప్రజలను ఆలోచించి అర్జునుని సింహాసనము వద్దకు రావింప అర్జునుడు సింహాసనమునందు కూర్చొనుటకు నిరాకరించి మిత్రులకు ప్రజలకు యిట్లు చెప్పెను. మిత్రులారా ! యీరాజ్యము నరకమునకుమార్గము. శాస్త్రము లందిట్లు చెప్పబడివున్నది. రాజు కర్తవ్యములతికఠినములు. వాటిని నిర్వహించుట మహాకఠినము. ప్రజలవద్దనుండి వసూలు చేయబడిన ధనముచేతనే దీనులగు ప్రజలను పోషింపవలెను. ప్రజలకు చోరుల భయము లేకుండునట్లు చేయవలెను, తన సుఖముకొరకై ప్రజలనుండి ధనము వసూలు చేయకూడదని శాస్త్రమందు చెప్పబడివున్నది. ప్రజలు కొందరధర్మముగా వర్తించినను ఆ పాపము రాజునకే చెందును. రాజ్యవిఘాతుకములగు రాగద్వేషాదులు మొదలగు శత్రువులు యెల్లప్పుడు రాజును ముట్టడించి వుండును. గనుక రాజ్యము స్వీకరింపను. ఇట్లని యతడా రాజ్యమును త్యజించెను.

హే చిత్తవృత్తీ! ఇంకొక కథ చెప్పెదవినుము.

**18.** ఇక్ష్వాకు వంశమున బృహద్రథుడను రాజుండెను. అతడు చాల కాలమువరకు రాజభోగము లనుభవించి ఒకనా

డతనికి వైరాగ్యము గలిగి వెంటనే తన కుమారుని పిలచి సింహాసనమున కూర్చుండ బెట్టి తపమాచరింప వనముల కరిగి ఏకాంత ప్రదేశమున తీవ్రమగు తపస్సు చేయుచుండెను. ఇట్లు కొంతకాలము గడచిన తరువాత ఒక మహాత్ముడచటి కరుదెంచి ఆనందభరితుడై వత్సా! నీ తపమునకు సంతోషించితిని, నీకు ఏమికావలెనో కోరుకొనుమనెను. రాజా మునికి నమస్కరించి వినయముతో మహాత్మా! ఆత్మజ్ఞానము ప్రసాదింపుమని ప్రార్థించెను. అపుడా ముని వత్సా! యీ వర ప్రాప్యము. నీకు లభ్యముకాదు. మరేదైనా వరముకోరుము. అపుడు రాజు యిట్లనెను. మహాత్మా! ఈ ప్రపంచములో ప్రతివస్తువు నశ్వరమైనది. ఓ మునిపుంగవా! ఈ ప్రపంచమందు స్థిరమగు వస్తువేదియు కనపించలేదు. ఇంద్రాది దేవతలు కూడా తమతమ పదవులస్థిరములని విడచిరి.

అట్టిచో నే నే పదార్థమును కోరుదును. నే నీ సంసార రూపమగు చెరువుయందు గ్రుడ్డికప్పవలె ఆశ్రయహీనుడనై దుఃఖించుచున్నాను. ఈ నా దుఃఖము దూరీకరించి నన్నుద్ధరించువారు మీరే, మిమ్మే శరణువేడు చున్నాను. ఈ మాటలువిని ఆ మునిపుంగవు డిట్లనెను. రాజా! నీ వాక్యములకు సంతసించితిని. నీవు వుత్తమ వైరాగ్య సంపన్నుడవు. ఇక్ష్వాకు వంశపుకీర్తి పతాకమువలె నీవు విరాజిల్ల గలవు.

నీవు నీ జన్మసాఫల్య మొనర్చుకొనగలవు. నీ యభీష్టము నెరవేరును. ఋషి యాతని కిట్లు ఆత్మబోధనచేసెను. రాజా! శబ్దస్పర్శాది విషయములన్నియు అనర్థదాయకములు. మనసు

మొదలగు యింద్రియములన్నియు వినాశనమునకే హేతువగు చున్నవి. ఈయింద్రియములన్నియు పురుషుని యెల్లప్పుడు విషయభోగములందే నిమగ్నుడై యుండునట్లు ప్రబోధించు చుండును. ఆత్మయొక్కటియే యానవునికి ముక్తిని ప్రసాదించును. ఇదియే శాశ్వతనియమము. సత్యము ఆత్మయొక్క ప్రతిబింబము. సత్యము నాశ్రయించుటచేతనే మనస్సు నిరోధించగలుగును. మనోనిరోధమే ఆత్మప్రకాశమునకు మార్గము. శుద్ధమగు మనస్సునందే ఆత్మప్రకాశము గల్గును. ఓరాజా! కట్టెలులేని అగ్ని తనకారణమందు లీనమగునట్లు వృత్తిరహితమగు మనస్సు ఆత్మయందు లీనమగును.

సమాసక్తం యథాచిత్తం జంతో ర్విషయగోచరే
యద్యేవం బ్రహ్మణిస్యాద్దై కో న ముచ్యేత బంధనాత్॥

ప్రాణులచిత్తము విషయమునందెట్లాసక్తమగునో అట్లే బ్రహ్మమందాసక్తమగుచో ఏ పురుషుడు సంసారబంధనమునుండి బయటబడడు?

వర్ణాశ్రమాచారయుతా విమూఢాః కర్మానుసారేణ
ఫలం లభ్యతే
వర్ణాది ధర్మం హి పరిత్యజంతః స్వానందతృప్తాః
పురుషా భవంతి॥

ఓరాజా! ఎవరు వర్ణాశ్రమము లాచరించుటయందాసక్తులయి ఆత్మచింతనయందనాసక్తులగుచున్నారో అట్టి మూఢులు తమతమ కర్మానుసారము ఫలమును పొందుచున్నారు. వర్ణాశ్రమాభిమానరహితులు ఆత్మచింతనగలవారై ముక్తిని పొందుచున్నారు.

శ్వపచోపి మహీపాల విష్ణుభక్తో ద్విజాధికః
విష్ణుభక్తివిహీనస్తు యతిశ్చ శ్వపచాధమః॥

శ్వపచ శివభక్తశ్చ ఉత్తమోత్తమ జన్మభాక్
శివభక్తి విహీనాశ్చ । బ్రాహ్మణాః శ్వపచాధమాః॥
న శూద్రా భగవద్భక్తా విప్రా భాగవతాస్మృతాః
సర్వవర్ణేషు తే శూద్రా యేహ్యా భక్తా జనార్ధనే.
అపవిత్రః పవిత్రోఽ వా సర్వావస్థాన్ గతోఽపి వా
యః స్మరేత్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః.
హృత్పుండరీక మధ్యేతు భావయేత్ పరమేశ్వరం
సాక్షీనాం బుద్ధి వృత్యస్య పరమ ప్రేమ గోచరేత్॥

తా॥ ప్రేమమయుడగు ఈశ్వరుని నీ హృదయకమలమునందు నిలిపి ధ్యానించుచుండుము. ఈశ్వరధ్యానము కల్పవృక్షము వంటిది. ఇట్టిధ్యానము చేతనే పూర్వీక ఋషులందరు మహోన్నతిని గాంచిరి.

మునిపుంగవా ! పరోక్షమననేమి అపరోక్షమననేమి? రాజావినుము.

పరోక్ష మపరోక్షం చ ద్వివిధం జ్ఞాన మిష్యతే
పరోక్షమస్థిరం ప్రాహు రపరోక్షంచ సుస్థిరమ్॥

తా॥ పరోక్షమనియు అపరోక్షమనియు జ్ఞానము రెండువిధములు. పరోక్షజ్ఞానమస్థిరమనియు అపరోక్షజ్ఞానము స్థిరమనియు చెప్పబడినది.

హితోపదేశగమ్యంయత్తత్పరోక్షంప్రచక్షతే గురుశాస్త్రాది

గురుశాస్త్రాది హేతువులచే పొందబడిన జ్ఞానమేదిగలదో దానిని పరోక్షమందురు.

అపరోక్షం పునశ్శ్రేష్ఠాదనుష్ఠా నాద్భవిష్యతి॥

గురుశాస్త్రోపదేశములను వినినతరువాత శ్రేష్ఠమైన అనుష్ఠానముచేత సాక్షాత్కరింపబడినది అపరోక్ష మనబడును.అక్షికి పరమైదృష్టికి గోచరము గానందున పరోక్ష మనబడును. ఆబ్రహ్మమే తన ఆత్మయైయుంటున్న దనుబోధము గలుగునపుడు అపరోక్ష మనబడును.

మునిపుంగవా భక్తియనఁనేమి ?

రాజా ! వినుము. గురువుయందును దైవమందును వేదాంతశాస్త్రమందునుగల యెడతెగని అనన్యమైన అపార ప్రేమకు భక్తియని పేరు. ఇది నిర్మలోదకమువంటిది. మాలిన్యమును శుద్ధజలములో గడుగునపుడు పరిశుద్ధతగలుగునట్లు రాగ ద్వేషాదిమాలిన్యము యీ భక్తియనెడు జలముచేత గడిగి శుద్ధపరచవలసి వుండును. అంతేగాక సారవంతమగుభూమిలో నుంచి విత్తనములుబెట్టినను వర్షములేనిచో యేలాగున ఫల వంతములుగావో ఆలాగున మనుష్యునియొక్క సాధనలన్నియు భక్తిలేనిచో వ్యర్థమగును.

అనన్యభక్తియనఁనేమి.

దైవమునకన్యముగా తన ఆత్మలేదనియు, తన ఆత్మ కన్యముగా దైవములేదనియు తలచుట అనన్యభక్తి. ఏమానవుని ఆత్మదైవములో ఐక్యమునొందునో అట్టివానికి దైవజ్ఞానము అనర్గళముగా గలుగును.

19. రాజా ! ఒకపుడు మైత్రేయ ఋషి కైలాసమునకు వెళ్ళి ఈశ్వరుని కిట్లు చెప్పెను. దేవా ! నాకు ఆత్మోపదేశము గావింపుమని ప్రార్థించెను.

ఈశ్వరుడు ; మునిసత్తమా ! వినుము.

దేహో దేవాలయః ప్రోక్తః సజీవః కేవలః శివః
త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహంభావేన పూజయేత్॥

ఈ దేహమే దేవాలయము. చేతనశీలమగు జీవుడే శివుడు. అజ్ఞాన రూపమగు మాలిన్యమును త్యజించి సోహం అను భావముతో పూజింపుము.

అఖేద దర్శినం జ్ఞానం ధ్యానం నిర్విషయం మనః
స్నానం మనోమలత్యాగః శౌచమింద్రియ నిగ్రహః॥

చరాచర ప్రాణికోట్లన్నిటియందు ఒకే ఆత్మను జూచుటయే జ్ఞానము మనస్సును నిర్విషయ స్థితియందుంచుటయే నిజమగుధ్యానము. మనోమాలిన్యమును త్యజించుటయే స్నానము. యింద్రియ నిగ్రహమే శౌచము.

ఈశ్వరుడు మునిపుంగవు కిట్లు ఆత్మోపదేశముచేసి కృతార్థుని గావించెను. చిత్తవృత్తీ! రాజ్యమందు సుఖమున్నచో బృహద్రథుడు రాజ్యమును పరిత్యజించి వనములకు పోవనేల?

20. హే! చిత్తవృత్తీ! సత్యాయుగమునందు ఋభుమునిపుత్రుడు నిదాఘుడనునతడు త్తను వైరాగ్యముగలవాడై మునులందరికంటె నుత్తమ మునియయ్యెను. అతడు బాల్యకాలముననే సకలవిద్యల నభ్యసించి తీర్థయాత్రలకై తన తండ్రిని ఆజ్ఞ యివ్వమని ప్రార్థించెను. తండ్రి ఆజ్ఞనుపొంది అనేక పుణ్యతీర్థములు సేవించి మూడు కోట్లన్నర తీర్థములందు స్నానముచేసి అనేకవిధములగు జపతపము లాచరించి యెంత పరిశ్రమచేసినను అతనికి చిత్తశాంతిగలుగక ఇంటికితిరిగివచ్చి తండ్రిని యిట్లని ప్రశ్నించెను. పితా! యెన్నితీర్థములు సందర్శించినను మనశ్శాంతి గలుగకపోవుటకు కారణమేమి? శాంతి లేనిచో మనుష్యుడు అనేక జననమరణములు పొందుచు కుమ్మరివాని చక్రమువలె అనేక యోనుల జన్మించుచు తిరుగుచుండవలెను. తండ్రీ! ఈ జననమరణరూపమగు చక్రమునుండి తప్పించుకొనుట కుపాయముమేమి? విచారణలేని మనుజుడు పశుతుల్యుడని చెప్పుదురు. కేవలము విషయసుఖము

లందే ఆసక్తుడగు మానవుడు జీవించివున్నను మృతతుల్యుడే. ప్రాణికోట్లన్నియు కామపిశాచమునకు లోనై యువావస్థ యందు పిచ్చివానివలె స్త్రీలవెంట తిరుగుచుండును. వృద్ధావస్థ యందు బంధుజనులచే తిరస్కరింపబడుచు నానా దుఃఖము లను పొందును గాన ఆత్మజ్ఞానము ప్రసాదింపుమని తండ్రిని ప్రార్థించెను.

ఋభు మునిపుత్రుని వైరాగ్యమునకు సంతసించి ఆత్మ తత్వము బోధింపనారంభించెను. నిదాఘా! వినుము యీజగత్తు దుఃఖభూయిష్టమైనది, నశ్వరమైనది, జడమైనది, పరబ్రహ్మము చేతనము, నిత్యము, సుఖస్వరూపము, ఒకేచేతనము వుపాది భేదమువలన నానారూపములను ధరించుచున్నది. ఒకే ఆకాశము ఘటమట వుపాధిభేదమువలన ఘటాకాశము మఠా కాశము అనబడుచున్నది. వుపాదిరహితమైనది మహాకాశ మనబడుచున్నది. అట్లే అంతఃకరణమందున్న చేతనము జీవు డనబడును. అంతఃకరణమను వుపాదికి వేరుగా వుపాదిరహిత ముగా వున్నపుడు ఈశ్వరు డనబడును. వాస్తవముగా జీవేశ్వర భేదము లేదు. ఏలనన చేతనమనునది అవయవరహితము, ఆకార రహితము. దీనికేదియు దృష్టాంతములేదు. గనుగ జీవియే బ్రహ్మరూపము. బ్రహ్మ, చేతనము, కర్తృరహితము, అభుక్తమునై యున్నది.

నిదాఘా! యిట్లు నిశ్చయించుకొన్నచో మానవుడు ముక్తినొందును. నీవును యిట్లే తలంచుము. అట్లు తలంచు టయే ఆత్మజ్ఞానము. అట్లు తలంచువానినే ఆత్మజ్ఞానియందురు.

తండ్రిమాటలు విని నిదాఘుడు తన నిజస్వరూపమును పొందెను.

• హే! చిత్తవృత్తీ! నీవును ఆత్మ ప్రాప్తికొరకు ప్రథమమున వైరాగ్య మవలంబింపుము. ఇట్టి వైరాగ్యము పొంది ఆత్మప్రాప్తి పొందినవారిని కొందరిని చెప్పెద వినుము.

ఒకానొకరాజు క్రొత్తపద్ధతితో ఒక గొప్పభవనము కట్టించి ఆ భవనమునం దొక సభచేయదలంచి పట్టణ ప్రజ లందరిని ఆహ్వానించెను. ప్రజలందరు ఆ భవనమునందు ప్రవేశించు సమయమున ఒక మహాత్ము డా భవనముముందుగా పోవుచు ఆ సభవారి నందరను చూచి తానును ఆ భవనము నందు ప్రవేశించెను. అందరు కూర్చున్న తదుపరి ఆ రాజు యిట్లనెను. నేనీభవనమును క్రొత్తపద్ధతితో కట్టించితిని. ఇం దేమైన దోషములున్నచో తెలుపుమను వుద్దేశ్యముతో మిమ్ములనందరిని యిచట కాహ్వానించితిని. దీనియం దేదైనా లోపమున్నచో ఆ లోపమును లేకుండ చేయుటకు ప్రయత్నింతును.

అది విని వచ్చినవారందరు భవనమంతయు పరీక్షించి అంతయు బాగున్నది, దీనియం దేమియు లోపము లేదనిరి. అందరు చెప్పిన అనంతరము ఆ మహాత్ముడు రాజా యిందు రెండులోపములున్నవి. అవి ఏవిధముగను బాపుటకు వీలు లేనివి. ఆ మాటలు విని రాజు పల్కెను. మహాత్మా! ఆ రెండు లోపంబు లేవియో తెలుపుడు. సాధ్యమైనంతవరకు వాటిని లేకుండ చేయుటకు ప్రయత్నింతును. రాజా! వినుము. మొదటిది ఈభవనమును నష్టభ్రష్టము చేయు దిన మొకటి

వచ్చును. నామరూపములు లేక నశించు దినమొకటి వచ్చును. రెండవది యీ భవనము కట్టించినవానినికూడ నాశనము గావించు రోజొకటి రాగలదు. కట్టించిన యజమానికూడ నామరూపములు లేక నశించును. ఈ రెండు లోపములు మాత్రము తీరుట అసంభవము. ఈ భవనముచూచి మీ రెంతో అహంకరించుకొనుచున్నారు. మహాత్ముని వాక్యములు విని రాజునకు వైరాగ్యము గలిగి విరాగియై మహాత్ముని పాదములపైబడి వారి సద్బోధలు విని ఆత్మజ్ఞానమును పొందెను.

చిత్తవృత్తీ! యిట్టిదియే మరొక దృష్టాంతము చెప్పెద వినుము.

21. ఒక మహాత్ముడు మార్గమున పోవుచూ అలసటచే విశ్రమించుటకు ఒక యోగ్యమైన స్థలముకొరకు యిటునటు పరికించుచుండెను. అతనికొక అతి రమణీయమైన మందిర మొకటి మార్గము ప్రక్కనే కనుపించెను. మహాత్ము డామందిరమందు ప్రవేశించెను. అందొక రాజు పట్టెమంచముపై ఆసీనుడయి పరివారమంతయు నిలచియుండెను. మహాత్ము డందు ప్రవేశించుటచూచి ఆ సేవకులు బెదరించుచూ యిది రాజుగారి మందిరము నీవేల యిచటకువచ్చితివి అని అడుగగా, అపుడా మహాత్ముడు యిది ధర్మశాలయను నుద్దేశముచే నేనిచటకు వచ్చితినని. సేవకులు మరింత అదరుచు, రాజు గారి మందిరము ధర్మశాలగా నొనర్చెదవా మేమి? ఆ మాటలు విని మహాత్ముడు రాజునకు ముందెవరు నివశించిరి?

సేవకులు: రాజుగారి తండ్రి. అంతకుముందెవరు నివశించిరి?

సేవకులు: వారితండ్రి. మహాత్ముడు: అంతకుముందు? వారి

తండ్రి. మహాత్ముడ నేను, యీప్రకారముగా ఒకరి వెనుక నొకరు వచ్చి నివశించే గృహమునకు ధర్మశాలనక నేమందురు? ఆ మాటలు రాజు విని దిగ్భ్రమచెంది మహాత్ముని ఆశ్రయించి వైరాగ్యముగలవాడై ఆత్మజ్ఞాన ప్రాప్తినిపొందెను. చిత్తవృత్తీ! యీ ప్రపంచమందెన్ని గృహములున్నవో అవన్నియు ధర్మశాలలే. జీవులను బాటసారులు యీ గృహములందు నివశించుచూ మమత్వముగలవారై యుందురు. జ్ఞానులు మమత్వములేనివారై నిమిత్తమాత్రముగా జీవయాత్రగడపి బాటసారులవలె జీవింతురు.

కేరళ దేశమున ఒక మహాత్ముడు యోగవాశిష్టమున జీవన్ముక్త జ్ఞానియొక్క అయిదవదశను పొంది యెల్లప్పుడు నవ్వుచు యెవరితో మాట్లాడక వుండెను. ఒకదినమున నలుగురు పిల్లలు మహాత్ముడుండు మందిరమునకు వెళ్ళి ఆడుకొనదలచి అందొక పిల్లవాడిట్లనెను. మహాత్ముని తొడలు లావుగా వున్నవి. తొడమీద పచ్చీసుగీసి ఆడుకొందమని. తుంటరి స్వభావము గలవారగుటచే తొడమీద పచ్చీసుగీసి ఆట ప్రారంభించిరి. ఇంతలో తొడనుండి రక్తము గీతలద్వారా ప్రవహించుచుండెను. పిల్లవాండ్రు రక్తముచూచి పారిపోయిరి. మహాత్ముడు నవ్వుచునే వుండెను. ఇంతలో ఒక యువకుడు వచ్చి మహాత్ముని తొడనుండి రక్తముగారుట చూచి చుట్టు ప్రక్కలనున్న కొందరిని పిలచుకువచ్చెను. మహాత్ముడేమియు మాట్లాడక నవ్వుచువుండెను. వచ్చినవారు కొందరి పిల్లవాండ్ర ద్వారా జరిగిన వృత్తాంతము తెలుసుకొని శస్త్రచికిత్సకుని పిలపించి కట్టుకట్టుటకు ప్రారంభింప మహాత్ముడు కట్టునేయక

నై ద్యునిచేయి తీసివేసెను. రక్తమట్లే కారుచుండెను. అచ్చటనే మరొకమందిరమున యింకొక మహాత్ముడు యీ వార్తనిని ఒక మనిషికిట్లు చెప్పిపంపెను. నీవు ఒక గృహమునందున్నచో దానిని పరిశుభ్రముగా వుంచవలెను. మనమీ శరీరమను గృహమున నివశించుచున్నాము గనుక దీనిని పరిశుభ్రముగా నుంచుటకై మందు వేయించుకొనమని చెప్పిపంపెను. ఆ మనిషి అట్లే మహాత్మునికి చెప్పగా మహాత్ముడిట్లు సమాధానము చెప్పి పంపెను. నీవు యాత్ర చేయుచున్నపుడు మార్గమున ననేక ధర్మశాలలందు విశ్రమించుచుంటివి. అవన్నియు యిపుడు శిధిలములగుచున్నవి. నీవు వాటిని బాగుచేయుటకు ప్రయత్నించ వెందుకు ? ఒకరాత్రి విశ్రమించుటకుగాను వాటి నన్నిటిని మరమ్మతు చేయించవలెనా ? ఈ శరీరమనే ధర్మశాలయందు జీవుడు మోక్షమార్గమున బోవుచు రాత్రివంటి యీ జన్మమందు శరీరమను ధర్మశాలను మరమ్మతు చేయించ దలచ లేదు. అని చెప్పిపంపెను. తరువాత కొలదికాలముననే మహాత్ముడు పరమపదవి జేరెను.

చిత్తవృత్తీ ! పూర్ణవైరాగ్యము చెందిన మహాత్ములు యీ శరీరమును ఒక ధర్మశాలగా భావించి మమతను వీడి వుందురు ఈ రాజ్యముకూడా అహంకారమునకు కారణము

చిత్తవృత్తీ! నీకొక లౌకిక దృష్టాంతము చెప్పెద వినుము.

ఒకరాజు తన శత్రువుల నందరిని జయించి సర్వజితు డని పిలువబడుచుండెను. ఆ రాజు తల్లిమాత్రము మామూలు పేరుననే పిలచుచుండెను. ఒకరోజున రాజు తన తల్లితో

రాజ్యములోని ప్రజలందరు నన్ను సర్వజితుడని పిలిచెరు. నీవు పూర్వమున్న పేరుననే పిలచెదవు. కారణమేమి అని అడిగెను. తల్లి చాల విచారశీలయై తన కుమారునితో నాయనా బాహ్యమగు యీ దేశమును జయించినంత మాత్రముననే మనుష్యుడు సర్వజితని పిలువబడడు. అంతరంగ శత్రువులను జయించిన నాడే సర్వజితయని పిలువబడును తన యింద్రియములను జయించిననే శత్రుజిత యనబడును. నీవు పృథ్వియందున్న ప్రజలందరు నాయాజ్ఞయందు నడచుచున్నారనుచున్నావుగాని నీ శరీరముమాత్రము నీ యధీనమందు లేదు. ప్రతిదినము క్రమక్రమముగా అది క్షీణించుచున్నది. నీ మనసుకూడా నీ యధీనమందు లేదు. యెల్లపుడు విషయాది సుఖములవైపునకే మరల్చుటకు ప్రయత్నించుచున్నది. చెడు పనులు చేయుటకై యుత్సాహము గలిగివున్నది. నీవీ శత్రువులను జయించినపుడే నేను సర్వజితయని పిలిచెదను. రాజా! వ్యాస స్మృతియందిట్లున్నది.

నరణేవిజయాశూరోఽధ్యయనాన్నచపండితః
నవక్తావాక్పటుత్వేన దాతాచార్థదానతః॥

తా॥ రణమునజయించిన శూరుడనబడడు. శాస్త్రములు చదివిన పండితుడనబడడు. వాక్పటిమవలన వక్తయనబడడు. ధనము దానము చేసినంత మాత్రమున దాత యనబడడు.

ఇంద్రియాణాం జయేశూరో ధర్మంచరతి పండితః
హితప్రాయోక్తిభిర్వక్తా దాతాసన్మానదానతః॥

తా॥ ఇంద్రియములు జయించిన శూరుడనబడును. ధర్మాచరణము గలిగియున్న పండితు డనబడును. యితరుల మంచిచెపునపుడే వక్తయనబడును. యితరుల సన్మానించువాడే దాత యనబడును.

రాజా! భర్తృహరి చెప్పినది చూడుము.

యౌవనం జరయాగ్రస్త మారోగ్యం వ్యాధిబర్హితం
జీవితం మృత్యురంభేతి తృష్ణైకా నిడపద్రవా॥

తా॥ యౌవనము జరావస్థచే మ్రింగబడుచున్నది. ఆరోగ్యము వ్యాధులచే హరింపబడుచున్నది. జీవితము మృత్యువుచే నాశన మొందు చున్నది. ఒక తృష్ణమాత్రమే వుపద్రవరహితముగా వున్నది.

రాజా! కామక్రోధములే మానవునకు పరమశత్రువులు. దూర్వాసమహాముని జ్ఞానసంపన్నుడైనను క్రోధమునకు వశు డగుటచే అనేక కష్టములు అనుభవింపవలసివచ్చినది. కామ వశులగుటచే యింద్రాది దేవతలుకూడ మహాకష్టములపాలైరి. గాన కామక్రోధములను శత్రువులను జయింపుము. అపుడు నేనుకూడా సర్వజితుడని పిలిచెదను. తల్లిమాటలువిని యా రాజు గొప్పవైరాగ్యము గలవాడై అంతరంగశత్రువులను జయించి కృతార్థుడాయెను.

హే చిత్తవృత్తీ దీనిగురించి ఒక ఇతిహాసము చెప్పెద వినుము.

22. ఒక పట్టణమున ఒకరాజు చాల ధనముగలవాడై యితరులకు పెట్టకయు తాననుభవింపకయు ధనము కూడ బెట్టుటయే ముఖ్యప్రయోజనమని తలచి పరమలోభియై తన పుత్రునికూడా ధనమువలన సుఖింపనీయక యౌవనవతియగు తన కుమార్తెకు ధనము ఖర్చగునని వివాహముకూడా చేయక

యుండెను. ఒకరోజున నర్తకి రాజుసభకు వచ్చి తనయాటను చూపింతుననని కోరెను. రాజామెతో నీయాట మరొకపుడు చూచెదమని చెప్పి పంపెను. ఆనర్తకి ఆ నగరమందే కొన్ని రోజులున్నతరువాత మరల రాజు సభకు వచ్చి తన ఆటను ప్రదర్శింతుననన యిపుడుకాదు కొన్నిరోజులాగి రమ్మని చెప్పి పంపెను ఈప్రకారముగా ఆ నర్తకి యడుగుటయు రాజు యిదిగో అదిగోనని సమయము గడుపుటయు జరుగుచుండెను. ఆ నర్తకి విసుగుచెంది మంత్రిగారియొద్దకేగి నాయాట చూపించమనెదరో లేక అక్కరలేదనెదరో తేల్చి చెప్పినచో నేను మరొక పట్టణమైనను వెళ్ళి జీవనోపాధికై వెదకుకొనెద ననెను అపుడా మంత్రి రాజుకడ కేగి ప్రభూ యీ నర్తకి యాటను ప్రదర్శించు మందము, మీరేమియు యివ్వనక్కరలేదు. అదం తయు మేమే చూచుకొనెదము లేనిచో ఇన్నిరోజులు తిప్పి వద్దనినచో ఇతరచోట్లకేగి మనలను నిందించుచుందురు. అపుడు మీకు చెడుపేరు రాగలదనెను. రాజందుల కంగీకరించెను. ఆ రాత్రియే ఆట ప్రారంభించి పలురకములగు ఆటలతో సభి కులనందరిని మెప్పించుచు రాత్రియంతయు గడచి ఒక ఘడియ ప్రొద్దుమాత్ర ముండెను. అయినను రాజామెకు యేమియు బహుమతి యీయకుండెను. అపుడానటి నటునితో రాత్రి యిక ఒక ఘడియమాత్రమే వున్నది. పక్షి అలసిపోయినది అని ఒక చరణము కీర్తన పాడినది. అదివిని నటుడు అంతయు పోయినది కొంచెమే మిగిలివున్నది. అదికూడా పోవుచున్నది. యిట్లు వారిరువురు పాడిరి. నటుని యీ పద్యమువిని ఆటను చూచుటకై వచ్చిన ఒక తపస్వి తన భుజమునందున్న కంబ

ళిని వారి కిచ్చివేసెను. రాజుకుమారుడు తన రత్నఖచితమగు రెండు కంకణములను యిచ్చివేసెను. రాజకుమార్తె తన రత్న హారమును తీసి అనటికిచ్చివేసెను. ఇదిచూచి రాజు చాల ఆశ్చర్యపడి మొదట ఆ తపస్విని నీ దగ్గర ఒక కంబళి మాత్రమే వున్నది. కప్పకొనుటకు మరొక వస్త్రమైనను లేదు. నీ దగ్గర కంబళిని వారి కెందుకిచ్చితివి? అపుడా తపస్వి రాజా నీ ఐశ్వర్యమునుజూచి నా మనసునందునూ భోగలాలసగలిగి నది. ఈ నటుని వాక్యములు వినినతోడనే నా మనసు సముద్ర తరంగములవలె కలతనొందుచున్నది. నా ఆయువంతయు తపస్సునందె గడచిపోయెను. ఇక కొంచెము మిగిలివున్నది. ఈ కొంచెమునకు భోగలాలసుడనై ఏల వ్యర్థపరచవలెను. ఇదియే నాకా నటునివలన గలిగినబోధయని అందుచే ఆ కంబళి నిచ్చితిననెను. రాజు తన కుమారుని నీవేల అమూల్య మగు కంకణముల నిచ్చితివనెను? మీరు నాకు ఖర్చుపెట్టుటకు కొంచెమైనను ధనమిచ్చుటలేదు. అందువలన నేను మీకు విషముపెట్టి చంపవలెనని తలచితిని. ఈ నటుడు చెప్పినది విని చాలకాలము గడచిపోయినది. వృద్ధుడైపోయినాడు. ఇక రెండుమూడు సంవత్సరములు మాత్రమే మిగిలివున్నవి. అవికూడా గడచిపోవుచున్నవి. ఈభాగ్యమునకు పితృహత్య గావించు టెందులకని యీ నటుని పద్యము వినగా బోధగల్గి రెండుకంకణములను బహుమతిగాయిచ్చితిని. అపుడా రాజు తన కుమార్తెను పిలచి నీవేల రత్నహార మిచ్చితివని అడిగెను. రాజకుమారి యౌవనము ప్రాప్తించి చాలకాలమైనది. కాముడు నన్ను బాధించుటచే మంత్రికుమారునితో వెడలి

పోవలెనని తలచితిని. కాని యీ నటుని వాక్యములు విని రాజు ఆయువంతయు గడచిపోయినది. మిగిలిన ఆయువుకూడా త్వరగానే గడచిపోవును. ఈభాగ్యమునకు తండ్రికి కళంకము దెచ్చుట యెందుకని నటుని వుపదేశముచే గలిగి నేను రత్న హారమిచ్చితినని చెప్పినది. ఈ నటుని వుపదేశమే మీ గౌరవమును కాపాడినది. మీ ఆయువును కాపాడినది. మీరును యీ నటునకు బహుమతి యివ్వుమని చెప్పగా రాజు నిజమేనని కొంతధనము బహుమతిగాయిచ్చివేసి తన కుమార్తెను మంత్రి కుమారుని కిచ్చి వివాహముచేసి తన సింహాసనము కుమారుని కిచ్చి రాజు వైరాగ్యము గలవాడై ఆత్మచింతనము గావించి కృతార్థుడాయెను.

హే ! చిత్తవృత్తీ! అమూల్యమగు కాలము వ్యర్థము చేయక నేనెవడను, ఎందుకు పుట్టితి, యేమిచేయవలె, యెచట కేగెద, రక్షకు డెవడు, అని విచారించి యిపుడైనా మిగిలిన కాలము వ్యర్థముచేయక దైవధ్యానమందె జీవయాత్ర గడుపుము.

విషబీజం భువిన్యస్య కథం స్వాధుఫలం వ్రజేత్
బీజంరుహ్యాత్తథా పుష్పేత్ఫలే దిత్యవదత్ శ్రుతిః.
యోగం కర్మంచ సాంఖ్యంచ తపోధ్యానం వ్రతంశ్రుతమ్
వ్యర్థంహి భక్తిహీనస్యవృష్టిహీనాకృషిర్యథా.

చిత్తవృత్తీ! మహాభారతమునందొక యితిహాసము జెప్పబడివున్నది. దానిని వినిపించెద.

28. ఒక బ్రాహ్మణుడు విదేశమునకుబోవుచు దారి తప్పి దట్టమైన అరణ్యమున ప్రవేశించెను. ఆయరణ్యము చాల

భయంకరమైనది. ఆ యరణ్యమున సింహములు, పులులు, మదపుటేనుగులు, గొప్ప సర్పములు, నాలుగు వైపుల సంచరించుచుండెను. ఆ క్రూరజంతువులను చూచి ఆ బ్రాహ్మణుడు భయభీతుడై అటు నిటు పరుగులిడ జొచ్చెను. తన ఆత్మరక్షణకై చోటుగానక చాల దుఃఖితుడై యుండెను. అపుడతని యెదుట పెద్దపెద్ద త్రాళ్ళను చేతబూని యొక పిశాచము కనుపించెను. అతడు భయభ్రాంతుడై అటునిటు తిరుగుచుండగ గొప్పసర్పములు శిరస్సులెత్తుకొని తనవైపునకే ప్రాకుచుండెను. వాటినుండి రక్షింపబడుటకై మరింత పరుగు లెత్తుచుండెను. ఇంతలో అంధకారమయమగు ఒక నూయి కనుపించెను. అపుడా బ్రాహ్మణుడు యింతకంటె రక్షణస్థాన మింకొకటిలేదని యెంచి యీ భయంకర శత్రువులను తప్పించుకొనుటకు నూతిపై వ్రేలాడుచుండు ఒక తీగను పట్టుకొని వ్రేలాడసాగెను. ఆ తీగవెంట కొంతవరకు జారి క్రిందిభాగము చూచెను. అందు ఒక గొప్ప సర్పమొకటి కనుపించెను. మరల పైకి ప్రాక నారంభించగా సగము తెలుపు సగము నలుపు ఆరు ముఖములు గల ఒక పెద్ద మదపుటేనుగు నూతివొడ్డునకొచ్చి ఆ బ్రాహ్మణునివంక చూచుచుండెను. బ్రాహ్మణుడు వ్రేలాడుచుండు తీగను రెండు పెద్దపెద్ద ఎలుకలు కొరకప్రారంభించెను.

చిత్తవృత్తీ! యిది దృష్టాంతము. ఇక ద్రాష్టాంతము చెప్పెద వినుము.

ఈ జీవుడను బ్రాహ్మణుడు తన నిజస్వరూపమును మరచి సంసారమను ఘోరారణ్యమున ప్రవేశించెను. క్రూ

రూపమును భూత పిశాచము భోగములనెడి త్రాళ్ళతో ఆతనిని బంధించుటకు వచ్చుచున్నది. గృహస్థాశ్రమమను సర్పము భయంకరమగు కోరలు చాచుకొని తిరుగుచున్నది. ఆయు వనెడి తీగను ఆధారముగా పట్టుకొని యీ జీవుడు సంసార కూపమను నూతియందు వ్రేలాడుచున్నాడు. కాలరూపమను సర్పము నూతియందుండి చూచుచున్నది. పగలు రాత్రియను రెండు ఎలుకలు ఆయువనెడి తీగను మొదలంటకొరకుచున్నవి. షడృతువులను ఆరు ముఖములు గలిగి శుక్లపక్షము కృష్ణపక్ష మను తెలుపు నలుపు వర్ణములుగల మదపు ఏనుగు సంసార కూపమున వ్రేలాడుచున్న జీవునివంక చూచుచున్నది. చిత్త వృత్తీ! యిట్టి విషమపరిస్థితియందుండియు జీవుడు వైరాగ్యము బూనకున్నాడు. వైరాగ్యము మినహా జీవుని రక్షించువారు యెవరును లేరు.

చిత్తవృత్తీ! యింకొక దృష్టాంతరము చెప్పెద వినుము.

24. ఒక నదియందు సర్పమొకటి ఒక కప్పను నోటి యందు కరచుకొని తినుటకు ఒడ్డునకుపోవుచుండెను. కప్ప పాము నోటియందుండియు చేపలను తినుటకై నోరు తెరచు కొనివుండెను. మూర్ఖురాలు తనే ఒకరినోటియందు ఆహారము నకై వున్నసంగతి గ్రహించలేకపోవుచున్నది. చిత్తవృత్తీ! ఇక ద్రాష్టాంతము వినుము. జీవుడను కప్ప కాలరూపమను సర్పము నోటియందు పట్టుబడివుండియు ఏ క్షణమున తనను తినివేయునోనని తెలియక యీ మూర్ఖుడు విషయభోగము లను చేపలను మింగుటకు నోరు తెరచుకొని వెతకుచున్నది. తనే యితరులకు ఆహారమైవున్న సంగతి గ్రహించుటలేదు.

అయినను మూర్ఖుడు కొంచెమైనను వైరాగ్యము పొంద కున్నాడు. ఇంతకంటె అజ్ఞాన మింకేమున్నది.

చిత్తవృత్తీ! మరొక దృష్టాంతరము వినుము.

25. ఒక మహాత్ముడు దేశాటనముచేయుచు ఒక నగర ద్వారముదగ్గరకు వెళ్ళునప్పటికి పొద్దుకూకి నగరద్వారము మూయబడెను. అపు డా మహాత్ము డా ద్వారముబయటనే పరుండెను. ఆ నగరముయొక్క రాజు చనిపోయెను. పుత్రు లెవరును లేరు. వారసులును లేరు. మంత్రులందరు ఆలోచించి ప్రాతఃకాలమునం దెవరు ముందుగా ద్వారముతట్టెదరో వారిని రాజసింహాసనమున కూర్చుండబెట్టి పట్టాభిషేకము చేయదలం చిరి. ద్వారము లోపల మంత్రులు సామంతులు పరుండి వుండిరి. బయట మహాత్ముడుపరుండి తెల్లవారగనే ఆకలిగలిగి వుండుటచే ద్వారముతట్టెను. వెంటనే మంత్రు లా ద్వారము తెరచి మహాత్ముని లోనికితీసుకుపోయి స్నానాదికము చేయించి విలువగల సుందరవస్త్రములు నిచ్చి సింహాసనముపై కూర్చుండ బెట్టి మహాత్మునితో మంత్రులు యిట్లుచెప్పిరి. మీరు యీ రాజ్యమునకు రాజుగారు. మీరు మాపై నేదైన కార్యభార ములు ఆజ్ఞాపించవచ్చును. మీ ఆజ్ఞానుసారము మేమందరము కార్యములుచేసెదము. అపు డా మహాత్ము డిట్లుచెప్పెను.

మంత్రులారా! మీరు నా రెండు కౌపీనములను శుభ్ర ముగా వుతికి ఒక పెట్టెయందుంచి తాళమువేసి జాగ్రతపరు పుడు. రాజకార్యములన్నియు మీ యిష్టానుసారము జరుపు కొనుడు. లాభనష్టములకు బాధ్యత మీరే వహింపవలయును.

నాకు రెండు కొట్టెలనుమాత్రము యిమ్ము. వేరు వనియేమియు నాకు వలనుపడదు. మంత్రులందరు తమ యిష్టప్రకారమే రాజ్యము పాలించుచుండిరి. మహాత్ముడు సింహాసనమున కూర్చుని భజన, జపము చేసుకొనుచుండెను. ఇట్లుండ ఆ రాజ్యముపై మరొకరాజు దండెత్తెను. మంత్రులా మహాత్మునికి శత్రువొకడు రాజ్యముపై దండెత్తెనని చెప్పిరి. అపుడు మహాత్ముడు తన కౌపీనములున్న పెట్టె తెరువుడని మంత్రులతో చెప్పెను. మంత్రు లట్లేచేసిరి. మహాత్ముడు తన రెండుకౌపీనములను తీసుకొని భుజముయందుంచుకొని వెళ్ళిపోవుచు యిట్లు చెప్పెను. లాభనష్టములు మంచిచెడ్డలు నా బాధ్యతకాదని మొదటనే చెప్పితినని రాజ్యమువిడచి వెళ్ళిపోయెను.

హే! చిత్తవృత్తీ! విరాగులగు మహాత్ములు రాజ్యమునైనను తృణీకరింతురు. వారికి యేపదార్థమందును ఆసక్తి వుండదు. రాజసింహాసనము, బిచ్చెటనము యీరెండును వారి దృష్టిలో ఒకటే.

చిత్తవృత్తి :- వివేకాశ్రమా! సప్తజ్ఞానభూమికల విషయము సెలవిమ్ము.

## సప్తజ్ఞానభూమికలు

జ్ఞానభూమిః శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా
విచారణా ద్వితీయాస్యా త్తృతీయా తనుమానసా
సత్త్వాపత్తి శ్చతుర్థీస్యా తతో ఒసంసక్తి నామికా
పదార్థభావనా షష్ఠీ సప్తమీ తుర్యగా గతిః.

1. శుభేచ్ఛ

స్థితః కిం మూఢ ఏవాస్మి ప్రేక్ష్యోహం శాస్త్రసజ్జనైః
వైరాగ్యపూర్వ మిచ్ఛేతి శుభేచ్ఛే త్యుచ్యతే బుధైః.

తా॥ నేనేల మూఢుడనై వున్నాను? వైరాగ్యభావముతో శాస్త్రాలోచన చేయుచు సజ్జనులతో గలియుదునని యిచ్ఛజనించుటయే శుభేచ్ఛ.

2. విచారణ

శాస్త్ర సజ్జన సమ్పర్కై ర్వైరాగ్యా భ్యాసపూర్వకమ్
సదాచార ప్రవృత్తాయాం ప్రోచ్యతే సా విచారణాః.

తా॥ శాస్త్రసజ్జనసాంగత్యముచే సత్యమేది, అసత్యమేది, ఆత్మయేది, అనాత్మయేది, బంధనమేది, మోక్షమేది యనువైరాగ్యభ్యాస విచారణయే విచారణ.

3. తనుమానస

విచారణా శుభేచ్ఛాభ్యా మిన్ద్రియార్థే ష్వరక్తతా
యత్ర సా తనుతాభావా త్ప్రోచ్యతే తనుమానసా॥

తా॥ శుభేచ్ఛజనియించిన పిమ్మట విచారణవలన యింద్రియభోగ విషయములందు రతి జనింపకుండుట తనుమానస.

4. సత్త్వోత్పత్తి

భూమికా త్రితయాభ్యాసా చ్చిత్తేఽర్థే విరతేర్వశాత్
సత్త్వాత్మని స్థితే శుద్ధే సత్త్వాపత్తి రుదాహృతా॥

తా॥ పైనాలుగు భూమికల అభ్యాసమువలన సాత్త్వికభావముదయించి విషయాసక్తి సమూలముగా నశించుటయే సత్త్వాపత్తి.

5. అసంసక్తి

భూమికా పంచకాభ్యాసాత్ స్వాత్మారామ తయాభృశమ్
అభ్యన్తరాణాం బాహ్యానాం పదార్థానామ భావనాత్.

తా॥ అసంసక్తియనగా ఆత్మయే సత్యమని యెరిగి ఆత్మానుసంధానము చేయుచు అసత్యములగు దేహేంద్రియ ప్రపంచమును మరచి సంకల్పశూన్యముగా వుండుటయే.

6 పదార్థభావన

పరంప్రయుక్తేన చిరంప్రయత్నేన విబోధనమ్
పదార్థభావనా నామ షష్ఠీ సఞ్జాయతే గతిః॥

తా॥ పదార్థభావనయనగా సముద్రమునకు వేరుగా తరంగములు లేనట్లు ఆత్మస్వరూపుడగు తన కన్యముగా ప్రపంచము లేదనియు. యీ ప్రపంచము తనయందు కల్పితమనియు నిశ్చయించి సదాత్రిపుటిరహితుడగుచు సకల దృశ్యములనుమరచి సాక్షిమాత్రుడై ఆనందించుట. దీనిని జీవన్ముక్తి యనియు తుర్యావస్థయనియు చెప్పుదురు.

7. తుర్యగా

భూమిషట్క చిరాభ్యాసా ద్భేదస్యా నుపలమ్భతః
యత్ స్వాభావిక నిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా గతిః॥

తా॥ సచ్చిదానందముకంటె భిన్నముగా లోకములుగాని భోక్తగాని భోజనముగాని మాతాపితృలుగాని జన్మవృద్ధి మరణములుగాని అంతఃకరణముగాని రాత్రిగాని పగలుగాని బ్రహ్మ, విష్ణు, రుద్రులుగాని వార పక్ష సంవత్సరములుగాని విద్యగాని అవిద్యగాని ధ్యానించదగినదిగాని స్నానముగాని మంత్రముగాని జపముగాని క్రూరుడుగాని చండాలుడుగాని ప్రపంచముగాని లేక స్వయంప్రకాశమై వెలుగుచుండుటయే తుర్యగాగతి.

చిత్తేచలతి సంసారో నిశ్చలే మోక్ష వుచ్చతే
తస్మాచిత్తం స్థిరంకుర్యా త్ప్రజ్ఞయా పరయాపరే
కృష్ణాజినే సిద్ధి ర్మోక్షశ్రీ ర్వ్యాఘ్రచర్మణి
కుశాసనే జ్ఞానసిద్ధిః సర్వసిద్ధిస్తు కంబళే॥

చిత్తవృత్తి - ప్రశ్న - వివేకాశ్రమా! బంధముక్తులు జీవుని కా లేక ఆత్మకా?

వివేకా - ఉ - చిత్తవృత్తీ! సర్వపరిపూర్ణమగు ఆత్మకు బంధ ముక్తులు లేవు. జీవుడున్ను తాను గురుకటాక్షముచే తన కీ జీవస్వరూపము మిధ్యయనియు నిత్యముక్త పరబ్రహ్మమగు ఆత్మయే తాననియు తెలిసికొనుటవలన జీవునకున్ను బంధ ముక్తులు లేవు.

చిత్త-ప్రశ్న-వివేకాశ్రమా! దేహమే తానని యున్నప్పుడును, జీవుడే తానని యున్నప్పుడును సాక్షియే తానని యున్న ప్పుడును బ్రహ్మమే తానని యున్నప్పుడును యీప్రపంచము యే ప్రకారముగా కనుపించును?

వివేకా-ఉ-చిత్తవృత్తీ! దేహమే తానని యున్నప్పుడు ప్రపం చము నిత్యమైనదిగాను, జీవుడే తానని యున్నప్పుడు నిత్యా నిత్యముగాను, సాక్షియే తానని యున్నప్పుడు మిధ్యగాను బ్రహ్మమే తానని యున్నప్పుడు సముద్రమునకు తరంగ ములు అన్యముగా లేనట్లు తన కన్యమేమియు లేక స్వప్ర కాశుడై వుండును.

చిత్త-ప్రశ్న-వివేకాశ్రమా! సకల ప్రపంచము మిధ్యయైన యెడల వేదములున్ను మిధ్యయేగదా! అట్టి అసత్యము

త్తైన వేదములవలన అజ్ఞాన మెట్లు నాశనమగును? ఆ అసత్యమైన వేదములవలన సత్యమైన మోక్షమెట్లు గలుగును?

వివే-ఉ-చిత్తవృత్తీ! స్వప్నమందునుజూచిన పెద్దపులి నిద్రాభంగము గలుగజేసి ఆ పులియు మిథ్యగా బోవునట్లు వేదములు అజ్ఞానము వలన బ్రహ్మము వేరు తాను వేరుగానున్నాడను జీవునియొక్క అజ్ఞానమును నాశనముజేసి బ్రహ్మాద్వైతజ్ఞానముగలుగజేసి కడవట ఆవేదములు దానితో సకల ప్రపంచము మిథ్యగా బోవును.

చిత్త-ప్రశ్న-వివేకాశ్రమా! సర్వపరిపూర్ణ బ్రహ్మమగు ఆత్మ సన్నిధానమున జడరూపముగా నుండు మనస్సుకు చేష్టలు కలదన్న యెడల జడముగా నుండు ఘటమునకు చేష్టలు గలిగివుండవలెను గదా?

వివే-ఉ-చిత్తవృత్తీ! సూదంతముయొక్క సన్నిధానమందు సూది మాత్రము చలించుచుండునుగాని తక్కిన ఘటపటాదులు చలింపనట్లు ఆత్మ సన్నిధానమందు మనస్సు చేష్టించునుగాని తక్కిన ఘటపటాదులు చేష్టించవు.

చిత్త-ప్రశ్న-వివేకాశ్రమా! సదామౌనమనుట కర్థమేమి?

వివే-ఉ-చిత్తవృత్తీ! ఏ ప్రకారము తుమ్మెద పుష్పములపై తిరుగుచున్నపుడు ఝుంకారముచేయుచు పుష్పములోభాగమునవున్న మధువునందు ప్రవేశించినపుడు మధురము గ్రోలుచు మౌనముగావుండునో ఆ ప్రకారముగా

ఆత్మానుభవము గలిగినపుడు సూర్యుని దర్శించిన దీపము వలెనుండును. (బ్రహ్మసాక్షాత్కారమే ననుట)

చిత్త-ప్రశ్న-వివేకాశ్రమా 'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ' యన్నట్లు పరమాత్మ ఒక్కటియేగదా దానికంటె వ్యతిరేకముగా నేమియు లేదని శృతులు చెప్పుచుండగా మాయ యనునది మరియొకటి యెక్కడిది. ఉన్నచో ద్వైతమగును గదా?

వివే-ఉ-చిత్తవృత్తీ! సత్యమే. మాయకూడా కలదు. అయినప్పటికి రెండువస్తువులుగావు. ఎట్లనగా త్రాడునుచూచి సర్పమని భ్రమించునపుడు భ్రాంతిచే రెండుగాదోచునే గాని యదార్థముగా రెండులేవు. త్రాడుఒక్కటియే. అట్లనే బ్రహ్మము ఒక్కటియే. దానియందు భ్రాంతిచే మాయతోచును. మాయయనుపదమునకు లేదనియర్థము. ఈ పదముచేతనే దానియొక్క లేమి స్పష్టమగుచున్నది. ఇక దానికి వునికియెక్కడిది అనిన బ్రహ్మమే దానికి వునికి. మిధ్యాజ్ఞానముచే రెండుగా ప్రతీతియగునేగాని, యదార్థజ్ఞానముచే పరబ్రహ్మముమాత్రమే అనుభవగోచర మగుచున్నది. మిధ్యాజ్ఞానముచే జగజ్జీవాదులు గోచరించుచున్నారుగాన జగజ్జీవాదులు మిధ్యాస్వరూపము.

చిత్త-ప్రశ్న-జగజ్జీవాదులు సత్యమైనచో ప్రత్యక్షముగా కనబడుచుండు నసత్యమని యెట్లు చెప్పగల్గము?

వివే-ఉ-ఎండమావులు అసత్యమైనను తోచుటలేదా? అదిదాని స్వభావము. అట్లె మాయకు జగత్తు జీవులుఅని భేదప్రతీ

తిని దోపింపజేయుటయే స్వభావము. కాన జగజ్జీవాదు లుండునట్లుగనపడుటయే గాని మృగతృష్ణా జలమువలె నసత్యములే. ఆత్మయే సత్యము.

చిత్త-ప్రశ్న-ఎండమావులసత్యమే కాని దానివలె జగత్తుకూడా నసత్యమని చెప్పుటెట్లు? జగత్తువలన సుఖదుఃఖములు ప్రతివారికి ననుభవములగుచున్నవి. కాన ఎండమావుల దృష్టాంతము సరికాదు.

వివే-ఉ-స్వప్నములో కనుపించు సుఖదుఃఖములు అప్పటికి సత్యముగానే కానవచ్చును. మేల్కొన్న వెంటనే అన్నియు నసత్యములేయని ననుభవమగుచుండును. జగత్తులో జరుగుచుండు సుఖదుఃఖములుకూడా నిట్లెయని గ్రహించవలెను. అట్లె ఆత్మస్వరూపమునెరుగని అజ్ఞానావస్థయందు జగత్తు సత్యముగానే గోచరించునుగాని అజ్ఞానావస్థనుండి మేల్కొన్నవానికి జగత్తంతయు నసత్యముగానే అనుభవమగుచున్నది.

చిత్త-ప్రశ్న- వివేకాశ్రమా! బ్రహ్మమునకు జగత్తుభిన్నమా? లేక అభిన్నమా?

వివే-ఉ-చిత్తవృత్తీ! అజ్ఞానదృష్టిలో భిన్నముగాను, శాస్త్ర దృష్టిలో భిన్నాభిన్నముగాను, జ్ఞానానుభవదృష్టిలో అభిన్నముగాను వుండును.

చిత్త-ప్రశ్న-వివేకాశ్రమా! బ్రహ్మము జ్ఞానస్వరూపముగాను, జగత్తు జడస్వరూపముగా నుండుటవలన బ్రహ్మమే జగత్తు అన్నయెడల ఈ రెంటికి ఐక్య మెట్లు కలుగును.

వివే-ఉ-చిత్తవృత్తీ! నామరూపములుగా దోచు యీజగత్తు నకు నిజస్వరూపము బ్రహ్మమేగాన ఐక్యము కలుగును. రజ్జుసర్పమురీతిగా బ్రహ్మమే జగత్తుగా దోచుచున్నదిగాని జగత్తనునది మరియొకపదార్థములేదు.

చిత్త-ప్రశ్న- వివేకాశ్రమా! అట్లయినచో మాయను చూచు నపుడు బ్రహ్మము గనబడదు. బ్రహ్మము చూచునపుడు మాయ గనబడదుగదా?

వివే-ఉ-చిత్తవృత్తీ! దారువుచే చేయబడిన ఏనుగును జూచి నిజమగు ఏనుగని భ్రమించువానికి అది దారువుగా దోచదు. దగ్గరకుజేరి పరీక్షించి చూచి అది దారువేయుని తెలుసుకొన్నవానికి అది ఏనుగని భ్రాంతి పుట్టదు. అట్లే మాయాప్రపంచము తలంచుచున్నవానికి బ్రహ్మము దోచదు. దారువును పరీక్షించినవానికి అది దారువే అయినట్లు సర్వము బ్రహ్మమాత్రముగా చింతించువానికి మాయాప్రపంచము దోచదు.

చిత్తవృత్తీ! నీవు యిపుడు తీవ్రమోక్షేచ్ఛ గలిగి శ్రద్ధతో వినుచున్నట్లు గ్రహించుచున్నాను. జీవబ్రహ్మైక్య మునుగూర్చి బాగుగా వివరించెద వినుము.

శ్రుత్యా సమీరిత స్త్వర్థో మోహాన్నాద్రియతే జనైః
సంసారాబ్ధౌ పతంత్యంధా ఇవ తే నైవదోషతః॥

తా॥ యదార్థము బోధించువేదము, ఈ విధముగా జీవబ్రహ్మ లొకటియే యని యెన్నిసార్లు బోధించినను సంగీకరింపక, సంశయించుచునే యుందురు.

ఈ సంశయమువలననే వారు గ్రుడ్డివారివలె పలుమారు జననమరణ ప్రవాహమున మునుగుచున్నారు. ఇట్టివారి కంటె శ్వానము యెన్నియోరెట్లు గ్రహణశక్తి గలిగివున్నది. ఎందుచేత ననగా కుక్క తన యజమానుని ఒకసారి గుర్తించిన తరువాత, ఆ యజమాని యెన్ని వేషములు వేసినను గుర్తించ గలుగుచున్నది. ఈ అజ్ఞాన జీవులు తత్వమసి, మహావాక్యము ద్వారాగాని లేక బ్రహ్మవేత్తలు ద్వారాగాని నీవే బ్రహ్మవు నీకంటె అన్యములేదని యెన్నిసార్లు బోధించినను అంగీకరింపకున్నారు.

అద్యాష్టమీతి నవమీతి చతుర్దశీతి
జ్యోతిష్కవాచోపవసంతి భక్త్యా,
శ్రుతేస్త్వహో తత్త్వమసీతి వాక్యం
నవిశ్వసంత్యద్భుత మేతి దేవ॥

తా॥ వేదము అదృష్ట విషయముల బ్రకాశింప జేయునది యగుటచే సర్వజ్ఞము. జ్యోతిష్కుడు ఒక శాస్త్రమును మాత్రమే యెరింగినవాడగుటచే నల్పజ్ఞుడు. అయినను లోకులు నేడు అష్టమి నవమి లేక ఏకాదశి ఈదినముల నుపవాస ముండవలయునని జ్యోతిష్కుడు చెప్పినచో వానిమాటల పరిపూర్ణముగా విశ్వసించి మహాభక్తితో నుపవాసముందురు. వానికంటె నెన్నియోరెట్లు విజ్ఞానవంతమగు వేదము, "నీకును బ్రహ్మమునకును భేదమేమియు లే"దని చెప్పినవాక్యము యించుకైనను విశ్వసింపరు. సర్వజ్ఞునికంటె అల్పజ్ఞుడు ప్రమాణభూతుడగుచున్నాడు.

చక్రవర్తియు సేవకుడు మనుష్యులే అయినను రాజ్యము కలదన్న మాత్రమున చక్రవర్తి సేవకునికంటె నధికుడైనట్లు ఈశ్వర జీవులిరువురు పరబ్రహ్మ మాత్రులేయైనను, శుద్ధ

సత్త్వోపాధి కలవాడగుటచే నా ఈశ్వరుడు జీవునికంటె నధికు డగుచున్నాడు. అట్లైనను మనుషత్వమునుబట్టి చూచిన, సేవక చక్రవర్తు లిరువురు నెట్లు ఏకస్వరూపులో, అట్లే బ్రహ్మత్వ మునుబట్టి చూచిన జీవేశ్వరులుకూడ ఏకస్వరూపులే యగు దురు.

నహిస్నాన శతేనాపిరజ్జు సర్పభ్రమోన్నృణాం
భయకంప ప్రవాహోయాతి వినావస్త్వ వమర్శనమ్।

## మహావాక్యచతుష్టయము

1. ప్రజ్ఞానం బ్రహ్మ

ఋగ్వేదము ఐతరేయోపనిషత్తు లక్షణవాక్యము.
యే నేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ
స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితమ్.

టీ॥ యేన = యే చైతన్యముచేత, ఇదం = ఈ నామరూపములను, ఈక్షతే = చూచుచున్నాడో, శృణోతి = శబ్దములను వినుచున్నాడో, జిఘ్రతి = గంధముల నాఘ్రాణించుచున్నాడో, వ్యాకరోతి = చ = అనేక పదములతో వ్యవహరించుచున్నాడో, స్వాద్వస్వాదూ = తీపిని, చేదును, విజానాతి = తెలుసుకొనుచున్నాడో, తత్ = ఆ చైతన్యము, ప్రజ్ఞానం = ప్రజ్ఞానమని, ఉదీరితః = చెప్పబడుచున్నది.

ఈ వాక్యమునందు ప్రజ్ఞానం, బ్రహ్మ అను రెండు శబ్ద ములుగలవు. అందు పై శ్లోకముచే ప్రజ్ఞానశబ్దమున కర్థము చెప్పి యీ క్రిందిశ్లోకముచే బ్రహ్మ శబ్దమునకు అర్థము చెప్పు చున్నారు.

చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వ గవాదిషు
చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యాపి.

టీ॥ చతుర్ముఖ = బ్రహ్మదేవునియందును, ఇంద్రదేవేషు = ఇంద్రాది దేవతలయందును మనుష్య = మనుష్యులయందును, అశ్వ = గుర్రములయందును, గవాదిషు = గోవులు మొదలగువానియందును, ఏకం = ఒక్కటియగు, చైతన్యం = చైతన్యము, బ్రహ్మ = బ్రహ్మమగును, అతః = ఆ కారణమువలన, మయ్యాపి = నా దేహమందునుగల, ప్రజ్ఞానము బ్రహ్మ = బ్రహ్మమగును.

2. అహం బ్రహ్మాస్మి.

యజుర్వేదము బృహదారణ్యకోపనిషత్తు అనుభవ వాక్యము.

పరిపూర్ణః పరాత్మాస్మిన్ దేహే విద్యాధికారిణీ
బుద్ధేః సాక్షితయాస్థిత్వా స్ఫురన్నహమితీర్యతే.

టీ॥ పరిపూర్ణః = అంతటనిండిన, పరాత్మా = పరమాత్మ, విద్యాధికారిణీ = జ్ఞానమునకు యోగ్యమైన, అస్మిన్ + దేహే = ఈ మనుష్య శరీరమునందు బుద్ధేః = బుద్ధికి సాక్షితయా = సాక్షియై, స్థిత్వా = ఉండి, స్ఫురన్ = ప్రకాశించుచు, అహమితి = నేనని, ఈర్యతే = చెప్పబడుచున్నాడు.

ఈవాక్యమునందు అహం, బ్రహ్మ, అస్మి అను మూడు శబ్దములుగలవు. అందు పై శ్లోకముచే అహం అను శబ్దమునకర్థము చెప్పి, యీ క్రిందిశ్లోకముచే బ్రహ్మ, అస్మి అను రెండు శబ్దములకు అర్థము చెప్పుచున్నారు.

స్వతః పూర్ణః పరాత్మాత్ర బ్రహ్మశబ్దేనవర్ణితః
అస్మీత్యైక్య పరామర్శ స్తేన బ్రహ్మభవామ్యహమ్.

టీ॥ స్వతః = స్వాభావికముగా, పూర్ణః = నిండియున్న, పరాత్మా= పరమాత్మ, అత్ర = ఈమహావాక్యమునందు, బ్రహ్మశబ్దేన = బ్రహ్మమను పదముచే, వర్ణితః = చెప్పబడినది, అస్మతి = అయితినని, ఐక్య=ఏకత్వము, పరామర్శ = తెలుపునదగును, తేన = ఆహేతువుచే అహం = నేను, బ్రహ్మ = బ్రహ్మస్వరూపముగా భవామి = అగుచున్నాను.

౪. తత్వమసి

సామవేదము ఛాందోగ్యోపనిషత్తు ఉపదేశవాక్యము.

ఏకమేవా ద్వితీయం సన్నామరూప వివర్జితం
సృష్టేః పురాధునాప్యస్యతా దృక్త్వం తదితీర్యతే॥

టీ॥ సృష్టేః = సృష్టికి పురా = పూర్వము. నామరూపవివర్జితం = నామరూపములు లేనిదియు అద్వితీయం = రెండవదిలేనిదియు ఏకమేవ = ఒక్కటియేయగు, అస్య = ఈసద్వస్తువునకు అధునాపి = ఇపుడును, తాదృక్త్వం = విచారదృష్టిచే, తదితి = అదియని, ఈర్యతే = చెప్పబడుచున్నది.

ఈ వాక్యమునందు తత్, త్వం, అసి, అను మూడు శబ్దములు గలవు. అందు పైశ్లోకముచే తత్ అను శబ్దమున కర్థము చెప్పి ఈ క్రిందిశ్లోకముచే త్వం, అసి, అను రెండు శబ్దములకు అర్థము చెప్పుచున్నారు.

శ్రోతు ర్దేహేంద్రియాతీతం వస్త్వత్రత్వం పదేరితమ్
ఏకదాగ్రాహ్యతే సీతి తదైక్యమను భూయతామ్.

టీ॥ శ్రోతుః = ముముక్షువుయొక్క, దేహేంద్రియ = స్థూలశరీర త్రయముకంటె, అతీతం = విలక్షణమగు, వస్తు = సద్వస్తువు, అత్ర = ఈ మహావాక్యమునందు, త్వం = నీవనెడు, పద = శబ్దముచేత ఈరితః = చెప్పబడుచున్నది అసీతి = అయితివని, ఏకతా = ఐక్యము గ్రాహ్యతే = గ్రహింపబడుచున్నది. తత్ = ఆ తత్వం పదార్థములయొక్క ఐక్యం = ఏకత్వము, అనుభూయతామ్ = ముముక్షువులచే ననుభవింపబడుగాక.

4. అయమాత్మాబ్రహ్మ

అధర్వణవేదము మాండూక్యోపనిషత్తు సాక్షాత్కార వాక్యము.

స్వప్రకాశా పరోక్షత్వ మయ మిత్యుక్తితో మతమ్,
అహంకారాది దేహాంతా త్ప్రత్యగాత్మేతి గీయతే.

టీ॥ అయమితి = ఈ యని ఉక్తితః = చెప్పుటవలన స్వప్రకాశ = స్వయముగా ప్రకాశించుటచేత, అపరోక్షత్వం = ప్రత్యక్షత్వము, మతం = సమ్మతమగును; అహంకారాది = అహంకారమే ఆదిగా గలిగినట్టియు, దేహ = స్థూలదేహమే అంతాత్ = అంతముగాగల ప్రపంచముకంటె, ప్రత్యక్ = అధిష్ఠానత్వసాక్షిత్వములచే, ఆత్మేతి = ఆత్మయని, గీయతే = చెప్పబడుచున్నది.

ఈ వాక్యమునందు "అయం, ఆత్మా, బ్రహ్మ", అను మూడు శబ్దములు గలవు. అందు పైశ్లోకముచే 'అయం, ఆత్మా,' అను రెండుశబ్దములకు అర్థముచెప్పి యీ క్రింది శ్లోకముచే 'బ్రహ్మ' అనుశబ్దమున కర్థము చెప్పుచున్నారు.

దృశ్యమానస్య సర్వస్వ జగత స్తత్త్వ మీర్యతే,
బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మస్వప్రకాశాత్మ రూపకమ్.

టీ॥ దృశ్యమానల=కనుబడుచుండెడి; సర్వస్య =సకలమగు; జగతః= జగంబునకు=తత్వం=అధిష్ఠానరూపము; బ్రహ్మశబ్దేన=బ్రహ్మశబ్దము చేత= ఈర్యతే=చెప్పబడుచున్నది; తద్బ్రహ్మ=ఆబ్రహ్మము; స్వప్రకాశ=స్వయంప్రకాశమానుడగు; ఆత్మ=ప్రత్యగాత్మయే; రూపకం=స్వరూపముగాగలదియగును అనగా ప్రత్యగాత్మయే బ్రహ్మ మనుట.

అహం బ్రహ్మాస్మి మంత్రోయం బుద్ధివ్యాధిం వినాశయేత్
అహం బ్రహ్మాస్మి మంత్రోయం చిత్తబంధం వినాశయేత్

అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం చిత్తవృత్తిం వినాశయేత్
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం సంకల్పాదీ న్వినాశయేత్
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం కోటిదోషం వినాశయేత్
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం కామాదీన్నాశయేత్క్షణాత్

సోదరా! అమృతోపములగు నీ సదుపదేశములచే నేను కృతార్థుడనైతిని. అజ్ఞానాంధకారమునందున్న నాకు జ్ఞానజ్యోతిని ప్రసాదించితివి. ఆత్మజ్ఞానప్రాప్తికి మార్గమును తెలిసికొన గలిగితిని.

## శాంతి

ఓమ్. సర్వేఽత్ర సుఖినస్సన్తు, సర్వేసన్తు, నిరామయా,
సర్వే భద్రాణి పశ్యన్తు మాకశ్చి ద్దుఃఖమాప్నుయాత్॥
ఓమ్. సర్వస్తరతుదుర్గాణి సర్వోభద్రాణి పశ్యతు,
సర్వః సద్బుద్ధి మాప్నోతు సర్వః సర్వత్ర నన్దతు.
ఓమ్. సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం సత్యస్యయోనిం
నిహితం చ సత్యే,
సత్యస్యసత్యం ఋతసత్యనేత్రం సత్యాత్మకం త్వాం
శరణం ప్రపన్నాః.
ఓమ్. మైత్రధర్మిక నిఖిలేశ సూదన సర్వసత్వ కరుణాయ వృద్ధత,
మోదప్రాప్తపరమడపేటక బ్రహ్మభూతనుగతోనమోస్తుతే
ఓం. అసతోమాం సద్గమయ, ఓం తమసోమాం జ్యోతిర్గమయ,
ఓం మృత్యోర్మాఽమృతంగమయ.
ఓమ్. శంనోమిత్రః శం వరుణః శంనో భవ త్వర్యమా,
శం న ఇన్ద్రో బృహస్పతిః శంనోవిష్ణు రురుక్రమ.

ఓమ్. పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే.
ఓమ్. సర్వేషాం స్వస్తిర్భవతు, ఓమ్, సర్వేషాం శాన్తిర్భవతు.
ఓమ్. సర్వేషాం పూర్ణం భవతు. ఓమ్ శాన్తి శాన్తి శాన్తిః
శంభోః శివ శివ, శివ శివ, శివ శివ,

నారాయణ, నారాయణ, నారాయణ.

శ్లో॥ సత్సంగ కల్పవృక్షోసౌ సర్వాభీష్ట ఫలప్రదః,
సువాక్యామృతవర్షేణ త్రీంస్తాపాన్ హరతే క్షణాత్.

---

1. పరులనుండి ఏమియు స్వీకరింపనివానికి జన్మాంతర జ్ఞానము సిద్ధించును. ఇంద్రియములద్వారా యేయొక్క విషయములను ఆత్మయందు చేరనీయక స్థిరనిష్ఠగలవానికి కాలాంతర జ్ఞానము గోచరించును.

2. పరిగ్రహావర్జితులైనచో అతిశీఘ్రకాలములోనే జన్మజన్మాంతరకర్మరాశి నశించి ఆత్మ ప్రబోధము కలుగును.

3. యే పురుషునిచే మనస్సువాక్కు నిగ్రహింపబడి రక్షింపబడునో అట్టి పురుషుని అరచేతిలో వేదతపోధనంబులున్నవని మునులు అనేకపర్యాయములు చెప్పియున్నారు.

4. నిరంతర విశ్వేశ్వరవిషయములో నిలకడగలవారు ప్రస్తుతము ఏమియు చేయజాలకపోయినను, కొలదికాలములోనే కోటిమంది పండితప్రకాండులు చేయజాలని మహాకార్యములను వీరు చేయగలరు. ఇది ముమ్మాటికి సత్యము.

# శ్రీ రమణమహర్షి సందేశము

మానవుడా! జాగ్రత. నీ అంతరాత్మలోనికి సుస్థిరముగా ఆంతరంగిక నేత్రముతో నవలోకింపుము. అపుడు నీకు దివ్యమగు పరమశాంతి లభించును. నీ వెల్లపుడును మౌనము నందే కాలము గడపుము. దీనియందు దాగిన అపారశక్తి యిమిడి వున్నది. మౌనమన కేవలము యేపని చేయకుండుటగాని, కదలకుండుటగాని, పలక బలపము చేతబట్టుటగాని కాదు. అది ఆలోచన లేకుండుటయు కాదు. నిరంతరము భగవంతునితో ఆలోచనగలిగియే యుండవలెను. అనగా ఆత్మేతర చింతలయందు మౌనముగలిగివుండుట అపుడచంచలమైన కొండవంటి పరమశాంతి పొందగలవు.

ఆత్మసందర్శనము పొందినవాడు రాయివలెనే పనిని చేయకయుండడు. అట్లేయున్నచో జడుని స్థితికిని, అతని స్థితికిని భేదము లేదు. మహాపురుషులగు ముక్తులును, సిద్ధులును నిజముగా ఆంతరంగిక రాజ్యములో నిరంతర కృషి సల్పుచుందురు. ఆధ్యాత్మిక జీవితమునకును, సాంసారిక జీవితమునకును పొందికయున్నదా అని అడుగవచ్చును. శ్రీరాముని ఉదాహరణముగా జూడుము. అతడాధ్యాత్మికముగా వృద్ధినొంది యుండలేదా? మరియు గృహస్థుడై జీవించివుండలేదా?

కర్మకును, జ్ఞానమునకును విరోధము లేదని గట్టిగా చెప్పవచ్చును. ధ్యానమునందుద్భవించిన ప్రవాహమునందుండియే మనుష్యుడు తన పనిపాటలన్నియు జేసికొనవచ్చును.

ఆటంకమేమియు నుండదు. అట్టివారికి ధ్యానమునకును, బహిరంగ వ్యాపారములకును భేదము కాన్పింపదు. నీవు, నేనెవ్వరు, అను ప్రశ్నపై ధ్యానము ప్రారంభించినచో శరీరముగాని, మనస్సుగాని, కోర్కెలుగాని నిజముగా నీవుకాదని గ్రహింపగలిగినట్లయిన నీ హృదయాంతర్భాగమున సత్యము సూర్యకాంతి వలె ప్రకాశించును.

నిజమైన ఆత్మ నెరుంగకపోవుటచే ప్రపంచ మింత సౌఖ్యహీనమైనది. మానవుని నిజమైన స్వభావము సౌఖ్యము. అతడుచేయు సౌఖ్యాన్వేషణము తనకు తెలియకుండ ఆత్మకై చేయు నన్వేషణమే. అందుచే మానవుడు దానిని పొందినంతనే అత దంతములేని సౌఖ్యమునొందును. అపు డతని మనస్సునందు చిక్కులన్నియు వదలి సౌఖ్యమును వరదలు గట్టును. సౌఖ్యము, నిజమైన ఆత్మయు నొకటే.

మెత్తని తెరవంటి చిత్తమునందు
బ్రహ్మ యను రవికిరణపంక్తి పడినపుడు
దానిలో నామెత్తదనము నశియించు
జగమునందలి వస్తుసంఘమూ తెరను
విడలేవు తమ ప్రతిబింబములపుడు 1
పైకిలేచి, యినప్రభంజనశక్తి
నీరధితోయముల్ వారిదములయి
వానయై పడి కొండకోనల జారి
యేరులై తమ తొంటియిల్లు సముద్రము
నచేరి విశ్రాంతి గొను టారయు మొకొ్క. 2
భూమిపై తమ గృహమ్ముల మోయుచున

వృక్షముల విడనాడి విహగమ్ములెగిరి
నిలుచుటలేక యెందేని తిరుగుచును
దూరదేశములకు బారి వెనుదిరిగి
కడకు తా మెచట బయల్వెడలెనో నట
వృక్షముల జేరి విశ్రాంతి గొనవె. 3
అట్లె యీ జీవనదులెల్ల నం తాత్మనుండి
ప్రాణతరువునుండి విహంగముల్ బయలు దేరి
నెగిరె కర్మమను పవనమున కీనాడు విశ్రాంతి కవి వాఛి
పోయి తాము పుట్టినచోటు వెదకుచు
పారుచు నెగురుచు వచ్చు తమ
సముద్రముకడకు తమచెట్టు కడకు. 4

---

## పరబ్రహ్మైవగతికి సాధనమగు పంచదశాంగయోగములు

యమో హి నియమః త్యాగో మౌనం దేశశ్చ కాలతః,
ఆసనం మూలబంధశ్చ దేహసామ్యం చ దృక్థ్సితిః.
ప్రాణసంయమనం చైవ ప్రత్యాహారశ్చ ధారణా,
ఆత్మధ్యానం సమాధిశ్చ ప్రోక్తా న్యంగాని వైక్రమాత్.

సూత్రప్రాయముగ తెలుపబడిన పంచదశయోగాంగ ములను శ్రుతియే సంగ్రహముగ వివరించుచున్నది.

1. యమము.

సర్వంబ్రహ్మేతి వై జ్ఞానా దిం దియ గ్రామ సం యమః,
యమోఽయమితి సంప్రోక్తోఽభ్యసనీయో ముహుర్ముహుః

యమమనగా సర్వము బ్రహ్మమే నను దృఢజ్ఞానము వలన యింద్రియములను విషయాభిముఖములుగ జేయక నిగ్రహము గలిగివుండుట.

2. నియమము.

సజాతీయప్రవాహశ్చ విజాతీయ తిరస్కృతిః,
నియమో హి పరానందో నియమాత్ క్రియతే బుధైః.

నియమమనగా సజాతీయమైన అఖండచిన్మాత్రవృత్తిని విజాతీయమగు ఘటపటాదివృత్తి తిరస్కారపూర్వకముగ నియమము సలుపుచు ఆత్మస్వరూపుడై వుండుట.

3. త్యాగము.

త్యాగః ప్రపంచరూపస్య సచ్చిదాత్మావలోకనాత్,
త్యాగో హి మహతాం పూజ్యః సద్యో మోక్షప్రదాయకః.

త్యాగమనగా గోచరమయిన సర్వప్రపంచమునందు సచ్చిదానందాత్మవృత్తిని అనుసంధానముచేయుచు, ప్రపంచ దృష్టిని వదలుట. ఇట్టిత్యాగమునే మహనీయులు కొనియాడిరి.

4. మౌనము.

యస్మాద్వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ,
యన్మౌనం యోగిభిర్గమ్యం తద్భవేత్ సర్వదా బుధైః.

బ్రహ్మము మనోవాక్కులకు అగోచరమయినది కావున, జడములయిన వాగాదింద్రియములచేపొందుట కశక్యమయినదని ఆ యింద్రియముల వ్యాపారము వదలుట. "గిరామౌనం తు బాలానా మయుక్తం బ్రహ్మవాదినామ్." నోటితో పలుకకుం

డుట మాత్రమే మానమునుట బాలురవిషయముగాని, బ్రహ్మ వేత్తల విషయముగాదు.

౫. దేశము.

ఆదావంతే చ మధ్యే చ జనో యస్మి న్నవిద్యతే,
యేనేదం సతతం వ్యాప్తం స దేశో విజనః స్మృతః.

దేశమనగా ఆదియందు అంతమునందు మధ్యయందు దేనియందు జనసముదాయము గనబడుట లేదో, ఏ వస్తువుచే సర్వము వ్యాపింపబడియున్నదో, ఆ బ్రహ్మమే యోగాభ్యాసార్హమయిన విజనప్రదేశము.

6. కాలము.

కల్పనా సర్వభూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః,
కాలశబ్దేన నిర్దిష్టం హ్యఖండానంద మద్వయమ్.

కాలమనగా అజ్ఞాననిమేష వికల్పితములయిన బ్రహ్మాది సర్వప్రాణి జాతమునకు అధికరణభూతమయిన అఖండానందాద్వితీయమయిన బ్రహ్మమే యగుచున్నది.

7. ఆసనము.

సుఖేనైవ భవే ద్యస్మి న్నజస్రం బ్రహ్మచింతనమ్,
సిద్ధయే సర్వభూతాది విశ్వాధిష్ఠాన మద్వయమ్.

ఆసనమనగా దేనియందున్న యెడల సర్వకాల సర్వావస్థలయందు బ్రహ్మానుసంధానము సుఖముగా కలుగునో అదియే ఆసనము. ఇదియే సిద్ధాసనము. ఇందుకు భిన్నములయిన సిద్ధాసన పద్మాసనములు మొదలగు ఆసనములన్నియు సుఖవినాశకములే యగును.

8. మూలబంధము.

యన్మూలం సర్వలోకానాం యన్మూలం చిత్తబంధనమ్,
మూలబంధస్సదాసేవ్యో యోగోఽసౌ రాజయోగినామ్.

మూలబంధ మనగా సర్వలోకములకు మూలభూత మయిన మనస్సుయొక్క బంధనము యెయ్యదిగలదో అదియే మూలబంధము. లేక బ్రహ్మమునందు మనస్సు కట్టివేయుట. ఇదియే రాజయోగుల కర్థమయినది.

9. దేహసామ్యము.

అంగానాం సమతా విద్యాత్సమే బ్రహ్మణి లీయతే,
నోచే న్నైవ సమానత్వ మృజుత్వం శుష్కవృక్షవత్.

దేహసామ్యత్వ మనగా "నిర్దోషం హి సమం బ్రహ్మ" అను స్మృతిప్రమాణము సముడయిన బ్రహ్మమునందు స్థూలాదిశరీరములను విలయముపొందించుటయే దేహసామ్యమగును. గాని ఎండినచెట్టువలె వంకరలేక శిరోగ్రీవముల నిడువుగా వుంచుట దేహసామ్యముగాదు.

10. దృక్స్థితి.

దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేద్బ్రహ్మమయంజగత్,
సా దృష్టిః పరమోదారా ననాసాగ్రావలోకినీ.

దృక్స్థితి యనగా సర్వాధికరణదృష్టిగల బ్రహ్మవేత్త దృశ్యాది త్రిపుటులను తిరస్కరించి సర్వత్ర బ్రహ్మమునే గాంచును. ఇదియే మిక్కిలి శ్రేష్ఠమయి దృష్టిగాని కేవలము ముక్కుచివర చూపు నిలుపుటమాత్రము సమ్యక్దృష్టి కాజాలదు.

11. ప్రాణాయామము

చిత్తాది సర్వభావేషు బ్రహ్మత్వేనైవ భావనాత్,
నిరోధ సర్వవృత్తీనాం ప్రాణాయామ స్సఉచ్యతే.

ప్రాణాయామమనగా చిత్తము మున్నగు సర్వభావములందు బ్రహ్మమునే భావనచేయుచు, ఆ బ్రహ్మముకంటె విభిన్నములగు సర్వవృత్తులను నిరోధించుటయే ప్రాణాయామమనబడును. ప్రాణాయామమునకు రేచక, పూరక, కుంభకములని మూడు వృత్తులుగలవు. అందు రేచకపూరకములనగా

నిషేదనం పపంచస్య రేచకాఖ్య సమీరితః,
'బ్రహ్మైవాస్మీతి యావృత్తిః పూరకో' వాయు రుచ్యతే.

రేచక మనగా బ్రహ్మముకంటె భిన్నముగ ప్రపంచమునునది లేదని, ప్రపంచమును నిషేధించుట. పూరకమనగా ఆ బ్రహ్మమే నేనను భావము, కుంభకమనగా,

తత స్తద్వృత్తి నైశ్చల్యం కుంభకం ప్రాణసంయమః,
అయం చాపి ప్రబుద్ధానా మజ్ఞానాం ఘ్రాణ పీడనమ్.

కుంభక మనగా ఆ బ్రహ్మమే నేనను భావము స్థిరముగా గలిగివుండుట. ఇటుల సర్వము బ్రహ్మమే అను దృఢ భావము గలిగివుండుటయే విద్వాంసులయొక్క ప్రాణాయామము. ఇక అజ్ఞానులగువార లాచరించు ప్రాణాయామమునకు నాసికారంధ్ర పీడనమే ఫలము.

12. ప్రత్యాహారము

విషయే ష్వాత్మతాం దృష్ట్వా మనసశ్చి త్తరంజకం,
ప్రత్యాహార స్సవిజ్ఞేయో౽భ్యసనీయో ముహుర్ముహుః.

ప్రత్యాహార మనగా ఇంద్రియగోచరములగు సకల విషయములు బ్రహ్మస్వరూపమే యను దృష్టితో చూచు చుండవలయును.

13. ధారణ

యత్రయత్ర మనోయాతి బ్రహ్మణస్తత్ర దర్శనాత్,
మనసో ధారణం చైవ ధారణా సా పరా మతా.

ధారణ యనగా మనసు ఎచ్చటెచ్చట ప్రసరించునో అచ్చటచ్చట బ్రహ్మమును గాంచుచుండుటయే యగుచున్నది. ఇదియే శ్రేష్ఠమైన ధారణ.

14. ధ్యానము

బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలంబతయా స్థితిః,
ధ్యానశబ్దేన విఖ్యాతః పరమానంద దాయకః.

ధ్యాన మనగా బ్రహ్మమే నేనను సద్వృత్తితో నిరాలంబుడయి యుండుటయే ధ్యానము. ఇట్టి ధ్యానమువల్లనే దుఃఖనివృత్తి ఆనందప్రాప్తి గల్గును.

15. సమాధి

నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మకారతయా పునః,
వృత్తివిస్మరణం సమ్యక్సమాధి రభిధీయతే.

సమాధి యనగా అఖండాకారవృత్తిగలిగి వుండుట. ఇది సవికల్పసమాధి. అట్టి అఖండాకారవృత్తియను స్మరణ కూడా లేక వుండునట్టి బ్రహ్మాత్మత్వస్థితి నిర్వికల్పసమాధి యనబడును. ఇదియే బ్రహ్మవేత్తలు ఆచరించిన పంచదశాంగ యోగసాధన.

# స్వామి వివేకానంద

1. త్యాగచక్రవర్తికి ప్రజలెవ్వరును బోధింపనర్హులు కారు. సంసారబద్ధు లెంతటి యశోధురీణులైనను వారి నేదియో యొక స్వార్థదృష్టిపట్టి పీడించుచునే వుండును. భగవంతుడుకూడా నొక గృహస్థుడుగా నవతరించునెడ వాని పరిపూర్ణపవిత్రతను నేను నమ్మజాలను. గృహస్థుడు మతాధికారియైనచో నాత్మవాంఛల నీడేర్చుకొనుటకే యత్నించును. గృహస్థులచే నడుపబడినసమస్తమతసంస్థలు నిట్లే నాశనమైనవి. సన్యాసములేని మతము నిలువదు.

2. నీ మనస్సు యెప్పు డఖండజ్ఞానపూరిత మగునో అప్పుడు నీచుట్టునుండు మానసములు పవిత్రములై తీరును. అట్టి పవిత్రమానసప్రభావముచేతనే యోగీశ్వరులు, సాధుపుంగవులు దుర్గమారణ్యములలో తేళ్ళు, పాములు మున్నగు దుష్టమృగములవలన హానిలేకుండా వుండగల్గిరి.

3. కొందరు యీ పారమార్థికవిషయములన్నియు కూటికిలేక ఇల్లువాకిలి విడచిన యేబైరాగులకొరకేగాని విద్యావంతులకు, ప్రజ్ఞావంతులకు తగవని నాస్తికభావప్రేరితులై దంభవశమున పల్కుచుందురు. కాని అట్టివారే ప్రకృతిదెబ్బలకు తాళజాలనపుడు, దుర్భర మానసిక యాతనలకు లోనగునపుడు, సంకటములు సంప్రాప్తించినపుడు అరుపులెత్తి అంగలార్చుచు 'హా! దైవమా, నీవేదిక్కు, నీకన్న వేరుదిక్కులే' దనకతప్పదు. విద్యావంతులుగాని, ప్రజ్ఞావంతులు గాని ధనవంతులుగాని, బలవంతులుగాని, భవరోగబాధితులగు ప్రతి

వారును యీ బ్రహ్మవిద్య నాశ్రయించేతీరవలయును. వేరు మార్గము లేదు.

4. యథార్థముగా బ్రహ్మచర్య శబ్దమునకు నిజార్థము చెప్పవలసినచో సర్వేంద్రియవశీకరణమే. ఈ బ్రహ్మచర్యా పాలనమున పూర్వీకఋషులు ఎట్టి మహోన్నతిని గాంచిరో వినియే యున్నాము. వారి మహాశక్తికి కారణము వీర్యస్తంభనమే. ఒక్కొక్క వీర్యబిందువులో సహస్రవజ్రముల శక్తి దాగివున్నది. ఈ ఓజస్సే భారతఋషులకును, భారతమునులకును భూతభవిష్యద్వర్తమానకాల దివ్యదృష్టిని-అన్యవశీకరణ శక్తిని ప్రసాదించినది. దీనినే పాశ్చాత్యులు మానవాకర్షణ శక్తి యందురు. ఇది జ్ఞానజ్యోతికి తైలమువంటిది గాన సాధకుడు దీనిని జాగ్రత్తగా సంరక్షించుకొనవలెను.

దుర్లభమగు మానవశరీరము ధరించి శాశ్వతానంద ప్రదమగు మోక్షమునుపొందుటకై ప్రయత్నింపనివాని నిరర్థకమేగదా! రక్తమాంసాస్థికల్పితశరీరముధరించి తత్సహాయమున మోక్షముపొందుటకుబదులుగా శరీరము తదంగములు అందలి రోమములుకూడా శాశ్వతమని తలచి క్షణిక శిశ్నోదరతృప్తికై అహంకార మమకారపాశబద్ధులై కోరినకోర్కెలు ఫలింపక శరీర ధన పుత్ర మిత్రాదులకు కష్టనష్టములుగలిగినపుడెల్ల ఎవరుదిక్కని అఱ్ఱులెత్తి అంగలార్చుచున్నారు. ఇట్టి దుర్గతి కేనా మానవుడు జన్మించినది? తా నాత్మస్వరూపుడై వుండి శాశ్వతానందము తన జన్మహక్కైయుండ క్షణికానందమునకై దైవమును మరచి జీవితలక్ష్యమేమో తెలియక తిరుగుచున్న మానవునిజీవితము ఎంత ఆశ్చర్యము. సర్వేశ్వర

సృష్టికి కిరీటమువంటి యీ మానవుడు దేహాభ్రమలకు జిక్కి కృంగి కృశించి కండ్లుమసకలై, చెవులు వినబడక, దంతము లూడి, అపేక్షమాత్రము పోక, యింటివారలచే తిరస్కరింప బడుచు, వార్ధక్యరోగము సంభవించి, స్వల్పకాలములో తన జీవితవృక్షము కూలిపోవునని తెలియక అనిత్యమగు దారా పుత్రాదులే నిత్యమని నమ్ముచున్నాడు. ఇట్టి మానవుని దశ చూచిన యెవరైనా జీవితలక్ష్యము మరచియుండగలరా?

విషయసంసర్గముచే గలిగెడి ఇంద్రియాదిసుఖములు అజ్ఞానావస్థయందు అమృతతుల్యముగా తోచినను పరిణామా వస్థయందు బల వీర్య రూప ప్రజ్ఞా మేధ ధన పుత్సాహములకు హానిగలిగి అంత్యకాలమున పంకిలమునగూలిన ఔకలపురుగు వలె దుఃఖము నొందుచున్నాడు.

---

ఓమ్.

1. 'పుణ్యకర్మానుష్ఠానము చేసినవారైనను భక్తిలేని యెడల, మరుజన్మములో శ్రీమంతులై పుట్టుదురేగాని, దైవభక్తి గలుగదు.

2. దైవభక్తిగలిగియు ధనముండి ధర్మముచేయని యెడల మరుజన్మములో దైవభక్తులై పుట్టుదురేగాని, తినుటకు ఆహారము లభింపదు. ఈశ్వరభక్తిగలిగియు గురుసేవ లేనియెడల భక్తులై పుట్టుదురేగాని, స్వరూపజ్ఞానము కలుగదు. గురుసేవ వల్లనే ఆత్మజ్ఞానము గలుగును.

# స్వామి దయానంద సరస్వతి

## పూర్వోత్తర జన్మలు

జీవాత్ముడు తా జేయు శుభాశుభకర్మల ననుసరించి నానావిధయోనులలో ప్రవేశించుచుండును. ముక్తిపర్యంత మాత్మకు పలుజన్మల నెత్తవలసివుండును. "అజో నిత్యః శాశ్వ తోఽయం పురాణో నహన్యతే హన్యమానే శరీరే" ఆత్మ నిత్యము. ఒక శరీరము నశించిన మరియొకశరీరము ధరించును. గీతయందు 'వాసాంసిజీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి' జీర్ణవస్త్రములను విడచి నవీనవస్త్రములను ధరించు నట్లు, జీర్ణశరీరములను విడచి నవీనశరీరములను ధరించును. పునర్జన్మసిద్ధాంతము నంగీకరింపకున్న ప్రపంచమున గల విషమ తను పరిష్కరించుట దుష్కర్మమేగాక యసంభవమగును.

శాస్త్రములందు మనుష్యజీవనోద్దేశము ముక్తియని వర్ణింపబడివున్నది. దుఃఖమునుండి విముక్తుడగుటయే ముక్తి యనబడును. మనుష్యుడు జ్ఞానపూర్వకముగ శాస్త్రనిర్దిష్ట సదాచారముల ననుష్ఠించుచు అభ్యాసవైరాగ్యములద్వారా కర్మలను దగ్ధబీజములవలె నొనరించిన ముక్తిస్థానము ప్రాప్తించును. ముక్తావస్థయందు జీవునికి ప్రకృతితో సంబంధముండదు. ఈశ్వరునియం దానంద మనుభవించుచుండును. సుఖదుఃఖ ముల ననుభవింపదగు యోనివిశేషములే స్వర్గనరకములు. ఉదరపోషకులగు పౌరాణికులచే కల్పింపబడు స్వర్గనరకములు స్థానవిశేషములనుండు లోకములు కావు.

## శ్రాద్ధము

మనుష్యుడు మరణించునపుడు పార్థివశరీరమును అగ్ని యందు దగ్ధముచేయుదురు. ఇట్లుచేయుట వైదికసిద్ధాంతమె. "భస్మాన్తగ్ం శరీరమ్" అని వేదమున నుదహరింపబడివున్నది. ప్రపంచమునగల మతములలో నెక్కువభాగము శరీరమున శరీరముకంటె భిన్నముగా చేతనమను నొకపదార్థమున్నదని నిశ్చయించబడివున్నది. మరణమనగా చేతనవస్తువు శరీరమును విడుచుటయని యర్థము. ఆ చేతనపదార్థమే వేదాదిశాస్త్రములందు జీవాత్మ యనబడుచున్నది. జీవాత్మ శరీరమును విడచి పోవునపుడు సూక్ష్మశరీర మతనివెంటపోవును. జీవాత్ముడు ఒక శరీరము విడచి తనకర్మలననుసరించి మరియొకశరీరమున ప్రవేశించుచుండును. ఇదియే మరల జన్మించుట. హిందువులలో చాలమంది మరణానంతర మా మరణించిన వ్యక్తి నుద్దేశించి పిండదానముల నొనరించి యట్లుచేయుటవలన వారికి సద్గతి గలుగునని యెంతురు. కాని వేదములందు పలుచోట్ల మరణానంతరమున పూర్వసంసారముతో నతని కెట్టి సంబంధ ముండదనియు, తా చేయు కర్మలతోనే వానికి సంబంధముండుననియు స్పష్టముగా వర్ణింపబడియున్నది. ఈ భౌతిక దేహసంబంధము వీడిపోయినతరువాత మంత్రాదులతో నతని నాహ్వానించుట, భోజనాదులచే తృప్తిపరచుట మున్నగు విశ్వాసములన్నియు నాత్మవంచనతప్ప మరియొండు విశేషము కానేరదు.

జీవుడు తన కర్మఫలముల నన్నిటిని భోగముద్వారా నశింపజేయునేని మోక్షసుఖ మనుభవించును. కర్మఫలము

లవశిష్టములై వున్న వాటి ననుభవింపదగు జన్మల నెత్తుచుం డును. ఈ రెండువిధములగు పరిస్థితులందును మృతకశ్రాద్ధాది క్రియలన్నియు నిరర్థకములే. శ్రాద్ధతర్పణాదిసమయములందు "పితరః అత్ర అగచ్ఛన్తు" అని మన మాహ్వానించుట మొద లగునవి అంధవిశ్వాసములు. శాస్త్రప్రమాణముల ననుసరించి శ్రాద్ధశబ్దమునకు అర్థమేమనగా జీవితులయివున్నతలిదండ్రులు, తాతముత్తవులు, మరియు నన్య వృద్ధ సజ్జనులు మున్నగువారి కతిశ్రద్ధతో నన్నవస్త్రాదులద్వారా సేవలొనరించి వారియా త్మలు తృప్తులగునట్లును, శరీరము స్వస్థమగునట్లును యత్నిం చుటయే శ్రాద్ధము, తర్పణము ననబడును. "శ్రత్ సత్యం దధతీతి శ్రద్ధా, క్రియతే శ్రద్ధయాదీయతే వా యత్కర్మ తత్ శ్రాద్ధం" సత్యధారణ చేయునది శ్రద్ధ, శ్రద్ధతో నొనరించు కర్మ శ్రాద్ధ మనబడును. పితరులనగా, తల్లి, దండ్రి, గురువు ఆపత్తు నుండి రక్షించువారు, పాలించువారు, వుపనయన మొనరించు వారు. ఇట్టివారికి శ్రద్ధతో నన్నజలాదుల నొసంగి సేవించు టయే శ్రాద్ధ మనబడును. మృతకశ్రాద్ధాదులు సర్వవిధముల అవైదికము లనుటలో నెట్టిసంశయము లేదు.

శాస్త్రమున "కుర్యా దహరహః శ్రాద్ధమ్" అని యున్నది. ప్రతిదినము వృద్ధులగు మాతాపితరులు మున్నగువారిని భోజనాదులచే సత్కరించవలయునని దీని యర్థము. ఇది జీవిత పితరులకనుట సంభవముగాని, మృతుల నుద్దేశించి చేయు క్రియ లన్నియు బూడిదలో నాహుతులు వేయుట అగును.

## యజ్ఞము

యజ్ఞమనగా హింసలకు తావీయని సత్కార్యములు. దానధర్మములచే పరోపకార మొనర్చుట, వేదాధ్యయనము, జప తప సంధ్యావందనము మొదలగు పుణ్యకర్మలే యజ్ఞమున కర్థము. పంచమహాయజ్ఞయములు ప్రతి గృహస్థున కవశ్యము ప్రతిదిన మాచరించవగిన కర్మలయి వున్నవి. అవి యెవ్వియన 1. బ్రహ్మయజ్ఞము = సంధ్యావందనము. 2. దేవయజ్ఞము = అగ్నిహోత్రములు. 3. అతిథియజ్ఞము = ఉత్తమ సన్యాసులకు విద్వజ్జనులకన్నమిడి సత్కరించుట. 4. బలి వైశ్వదేవము = కుక్క మున్నగు గృహజంతువులకు, వికలాంగులకు, నిరుపేదల కన్నమిడుట. 5. పితృయజ్ఞము = తల్లిదండ్రులను, వృద్ధులను సేవించుట.

## భూతప్రేతములు

హిందువులలో ననేకులు తమకుగలుగు నాపత్తులకు మూలము భూతప్రేతములని భావించి నానావిధ కృత్రిమకర్మల నాచరించుచురు. యథార్థముగా భూతప్రేతములవిశ్వాసము మతిభ్రమ. ఇవన్నియు వుదరపోషకులగు వంచకులచే కల్పింపబడిన మిథ్యావిశ్వాసములు. గ్రహచారము ననుసరించి మనుజులకు కష్టనష్టములు గలుగునని అవి శాంతిదానాదులచే నుపశమించునని చెప్పుట యివన్నియు పామరుల వాక్యములు. వేదాది సచ్ఛాస్త్రములం దిట్టి మిథ్యావిచారములకు తావు లేదు.

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః

# మలయాళ మహర్షి లేఖలు

1. బ్రహ్మనిష్ఠవిషయములో అజాగ్రత్త పడకుండ చూచు చుండవలెను. సమస్తమునకదే ఆధారభూతము, దేహమునకు ప్రాణము ఎటువంటిదో, బ్రహ్మనిష్ఠయు ఆత్మకు ప్రాణము వంటిది. దానికి భంగకరమైన కార్యములు చేయరాదు. ఒక వేళ అట్లు చేసినచో తాత్కాలికలాభముకనుపించినను, కొలది కాలములోనే విపత్తుగా పరిణమించును. రాజాధిరాజులు రాజ్యమును ఆత్మనిష్ఠకొరకే తృణీకరించిరి. కాలము చాలా విలువగలది. దైవానుగ్రహముగలవారు నిస్సహాయులైనను బహుసహాయము గలవారనియు, నిర్ధనులైనను మహాశ్రీమంతులనియు, దుర్బలులైనను, మహాబలవంతులనియు తెలియవలెను. ఎట్టివిషమస్థితిలోకూడా మామూలునిష్ఠ చేయక భోజనము చేయరాదని ఒక దృఢవ్రతము వుండవలెను. అప్పుడే మీరు తరింపగలరు.

2. ఆత్మీయులారా! మనము భూలోకమునకు వచ్చినందుకు జన్మరాహిత్యమగుముక్తినిసంపాదించుట, పరప్రాణులకుపకారము సల్పుట ముఖ్యధర్మములు. ఇదే జన్మసాఫల్యమునకు సార్థకము. ఇట్టివారే పరమేశ్వరునకు ప్రీతిగల బిడ్డలని తలంచవలెను. సృష్ట్యారంభమునుండి నేటివరకు మనమందరము, యీభూతకోట్లన్నియు పుట్టుచు గిట్టుచు వచ్చినవి. ఇది ప్రకృతి నుండి విముక్తిగలిగి మోక్షముగలుగువరకు అందరికి పరంపరంగా జరుగునే యుండును. ఆలాగున విచారణచేసిన యింతవరకెన్నిజన్మములయినవో, యెచ్చటెచ్చట పుట్టినామో, అప్పుడు

గల దేహసంబంధము యెచటికిపోయినదో, యిక యెన్ని జన్మములు జీవకోట్లు పుట్టునో, అప్పుడెవరితో సంబంధము గలిగి వుందురో, ఇవన్నియు దీర్ఘాలోచనచేసిన వర్తమానజన్మ ఒక యాత్రికుని దినప్రయాణమువంటిదని బోధగలుగును. ఈనాటి జన్మపరంపరా విచారించి శాశ్వతసుఖము పొందేలాగున చూచుటయే బుద్ధిమంతులయొక్క కర్తవ్యము.

8. పవిత్రహృదయముగలిగి బ్రహ్మనిష్ఠగలవారికి ఏదివచ్చినను అది మేలుకొరకే యగును. ధ్యానముచే ఆత్మశుద్ధి గలిగినపుడు అమోఘమైనబోధ వుదయమగును. ఆత్మశక్తియు గలుగును. పూర్వీకఋషులందరు అట్టి ఆత్మశక్తిగలవారు. సత్యధర్మములను ప్రాణములవలె సంరక్షించుకొనుచుండవలెను. బ్రహ్మజ్ఞానమంతయు ఆచరణపై ఆధారపడి వున్నది. ఆచరణ లేని వేదాంతవిచారణ, పంచీకరణవిచారణ, వ్రతములు, భజన భక్త్యాదులన్నియు వూసరక్షేత్రముతో పెట్టిన మంచివిత్తనము వలె వ్యర్థమగును. ఆచరణలేనివాడు ఈశ్వరుడుగా వచ్చినను నమ్మకూడదు.

గృహస్థాశ్రమ మందుండి ముక్తిపొందవచ్చునా లేక తురీయాశ్రమము స్వీకరించవలెనా ?

ఈ విషయమును గురించి కొన్ని ధర్మములు చెప్పెద వినుము. గృహస్థాశ్రమమునందే వైరాగ్యము గలుగుటకు తగిన అవకాశము లున్నవి. గొప్పగొప్పమహాత్ములు, రామచంద్రుడు, వశిష్ఠుడు మొదలగుఋషులుకూడా గృహస్థాశ్రమము నుండియే బయలుదేరిరి. ఏ ఆశ్రమమందుండినను ఆత్మ

జ్ఞానప్రాప్తికి వైరాగ్యమే ముఖ్యసాధనము. వైరాగ్యమున్నచో బ్రహ్మచర్యాశ్రమమునందేమి, గృహస్థాశ్రమమునందేమి, సన్యాసాశ్రమమునందేమి దేనియందైనను ఆత్మజ్ఞానము పొందవచ్చును. ఈ విషయమున నీకు శివుడు పార్వతి కుపదేశించిన గృహస్థధర్మములు తెలిపెద వినుము.

గృహస్థధర్మప్రవరో మనీషిణాం బ్రహ్మాదిభి శ్చాభిహితో
నగాత్మజే,
తప్త్వా తపస్వీ విపినే క్షుధార్తో గృహం సమాయాతి
సదాన్నదాతుః.

ఓ పార్వతీ! గృహస్థుడే మనీషులలో ధర్మాచరణలలో శ్రేష్ఠుడని బ్రహ్మాదులచే చెప్పబడెను. వనమునగాని ఆశ్రమమునగాని తపమాచరించెడు తపస్వి ఆకలిబాధగలుగునప్పుడు అన్నదాతగృహము చేరుచున్నాడు. అట్టి తాపసులకు యేగృహస్థు అన్నదానము చేయుచున్నాడో అట్టి గృహస్థాశ్రమము సర్వోత్కృష్టమైనది.

గృహాశ్రమః పుణ్యతమ స్సర్వదా తీర్థవ ద్గృహమ్,
అస్మిన్ గృహాశ్రమే పుణ్యే దానం దేయం విశేషతః.

ఆలాగున అతిథిపూజాదికార్యముల నొనర్చుచుండు గృహస్థాశ్రమము చాల పుణ్యమైనది. అట్టి గృహము ఎల్లప్పుడును పుణ్యతీర్థమువంటిది.

దేవానాం పూజనం యత్ర అతిథీనాం చ భోజనమ్,
పథికానాం చ శరణం అతో ధన్యతమో మతః.

ఏ గృహమందు, దేవతార్చనము, అతిథిభోజనము, యాత్రికుల ఆశ్రయము గలుగుచుండునో అట్టి గృహస్థాశ్రమము ధన్యమయినది.

నాశ్రమం కారణం ముక్తేః దర్శనాని న కారణమ్,
తథైవ సర్వకర్మాణి జ్ఞానమేవ హి కారణమ్.

మోక్షముకొరకు సన్యాసాశ్రమముగాని, గృహస్థాశ్రమముగాని కారణముగాదు. ఆ లాగున శాస్త్రములు చదువుటగాని యితరకర్మలజేయుటగాని కారణముగాదు. ముక్తికి జ్ఞానమొక్కటియే కారణము.

వనేఽపి దోషాః ప్రభవన్తి రాగిణాం గృహేఽపి పంచేన్ద్రియనిగ్రహ స్తపః,
అకుత్సితే కర్మణి యః ప్రవర్తతే నివృత్తరాగస్య గృహం తపోవనమ్.

రాగద్వేషముగలవారు వనమునందుండినను దోషములే గలుగుచుండును. గృహమునందుండినను పంచేంద్రియనిగ్రహముగలవాడు తాపసుడే యగును. నిందితముగాని కర్మచేయువాడెచ్చటుండినను జ్ఞానియే యగును. రాగరహితునకు గృహము తపోవనమువంటి పుణ్యభూమియగును.

అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతి నివర్తతే,
సతస్మై దుష్కృతం దత్వా పుణ్య మాదాయ గచ్ఛతి.

అన్నాభిలాషతో అతిథి యే గృహస్థుని యింటికివచ్చిన అన్నమిడక నిందితుడై గృహమునుండి వెడలిపోవునో ఆ గృహస్థుడుచేసిన పుణ్యమంతయు అతనినుండి మరలిపోవును. అతిథి యేదైన చేసిన పాపమున్నచో ఆ గృహమునందే నిలచిపోవును. కావున ఓ పార్వతీ,

యథా వాయుం సమాశ్రిత్య వర్తన్తే సర్వజన్తవః,
తథా గృహస్థ మాశ్రిత్య వర్తన్తే సర్వఆశ్రమాః.

ప్రాణవాయువు నాశ్రయించి జంతువులెల్ల జీవించునట్లు గృహస్థుని నాశ్రయించి తక్కిన ఆశ్రమస్థులు జీవింతురు.

యస్మాత్త్రయోఽప్యాశ్రమిణో జ్ఞానే నాన్నేన చాన్వహం,
గృహస్థే నైవధార్యన్తే తస్మా జ్జ్యేష్ఠాశ్రమో గృహీ.

గృహస్థుడు తక్కిన ఆశ్రమములవారిని వేదాధ్యయనముచేయించి అన్నవస్త్రాదుల నొసంగి ప్రతిదినము పోషించుచున్నాడు గావున, గృహస్థాశ్రమమే శ్రేష్ఠము.

గృహస్థుడు ప్రతిదినము పంచయజ్ఞపరాయణుడై వుండవలెను. వివరము.

గృహస్థుడు ఎంత అహింసావ్రతము నవలంబించినను అనివార్యములగు అయిదు పాపములు వచ్చుచుండును. అన్నము మొదలగు వంటచేయునపుడు కట్టెలయందును, వూడ్చునపుడు భూమియందును, పారతో చెక్కునపుడును, సస్యములలో గల క్రిములను తొలగించునపుడును, నీళ్ళు కాచునపుడును, ఇల్లు కట్టునపుడును నేర్పడు ప్రాణినాశనముకొరకు పంచయజ్ఞములను పూర్వీకు లేర్పరచిరి.

తాసాంక్రమేణ సర్వాసాం నిష్కృత్యర్థం మహర్షిభిః,
పంచక్లుప్తాః మహాయజ్ఞాః ప్రత్యహం గృహమేధినాం.

ఈ అయిదుపాపములు పోవునిమిత్తము మహర్షులు గృహస్థునకు పంచమహాయజ్ఞములు వరుసగా విధించిరి.

## ఋతుకాల నిర్ణయము

ఓ పార్వతీ! గృహస్థాశ్రమమందుండువారికి ఋతుకాలనిర్ణయములు తెల్పెద వినుము.

ఋతుకాలాభిగామీ యః స్వదారానిరతశ్చయః,
స సదాబ్రహ్మచారీ హి విజ్ఞేయస్సగృహాశ్రమీ.

ఋతుకాలమందుమాత్రము స్వభార్యయందు చేరు గృహస్థుడు

యెల్లపుడు బ్రహ్మచారియనియే గ్రహించవలెను. అట్టి నారీమణియు బ్రహ్మచారిణియే యనందగును.

మృతేభర్తరి సాధ్వీస్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా,
స్వర్గంగచ్ఛత్య పుత్రాపి యథా తే బ్రహ్మచారిణః.

ఏ సాధ్వియగు స్త్రీ భర్త మరణించినపిమ్మట బ్రహ్మచర్యవ్రతమనుష్ఠించుచున్నదో అట్టి సాధ్వి నైష్ఠికబ్రహ్మచారులు యే బ్రహ్మలోకము పొందెదరో భర్తృవియోగానంతరము ఆ బ్రహ్మలోకమునే పొందెదరు.

ఋతుస్స్వాభావికం స్త్రీణాం రాత్రయః షోడశస్మృతాః,
చతుర్భి రితరై స్సార్థ మహోభిస్స ద్విగర్హితైః.

స్త్రీలకు స్వాభావికముగా పదునారుదినములవరకు ఋతుకాలము. అందు మొదటి నాల్గుదినములు సజ్జననిందితములు.

తా సా మాద్యా శ్చతస్రస్తు నింది తైకాదశీ చయా,
త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః.

మొదటి నాలుగు దినములును, పదునొకండవ పదుమూడవరాత్రియు నిందితములు. తక్కిన పదిరాత్రులు ప్రశస్తములు. ఇవిగాక అమావాస్య ఆదివారము ఏకాదశీ మొదలగు పర్వదినములు, వ్రతదినములు నిందితములు.

యుగ్మాస్తు పుత్రా జాయంతే స్త్రియోఽయుగ్మాస్తు రాత్రిషు,
తస్మా ద్యుగ్మా సుపుత్రార్థీ సంవిశే దార్తవే స్త్రియం.

ముందుచెప్పిన పదిరాత్రులలో ఆరవది యెనిమిదవది మున్నగు సరిరాత్రులలో పుత్రులు పుట్టుదురు. 5-7-9 మొదలగు బేసిరాత్రులలో స్త్రీలు జనింతురు. కావున పుత్రార్థియగువారు సరిరాత్రులలోను, పుత్రికల గోరువారు బేసిరాత్రులలోను; ఋతుకాలమందు స్వభార్యలను గూడవల

యును. ఇట్టి ధర్మము నిర్వహించువారు బ్రహ్మచారియనియే పరిగణింప బడుదురు.

ఊన షోడశ వర్షాయాః మప్రాప్తిః పంచవింశతిం,
యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థః సవిపద్యతే.
జాతోవా న చిరంజీవే జీవేద్వా దుర్బలేన్ద్రియః,
తస్మా దత్యన్త బాలాయాం గర్భాధానం నకారయేత్.

16 సంవత్సరములు పూర్తిగాని స్త్రీయందు 25 సంవత్సరములవయస్సు నిండని పురుషుడు గర్భముధరింపజేయుచో అట్టి గర్భము నిలువజాలదు. ఒకవేళ గర్భము నిలచి శిశువు జన్మించినను చాలకాలము జీవించదు. జీవించినను రోగపీడితుడై ప్రజ్ఞలేనివాడగును. అందువలన పరిపక్వము గానటువంటి పూర్ణారోగ్యము లేనటువంటి కన్యకు గర్భాధానము చేయరాదు.

రసాద్రక్తం తతో మాంసం మాంసాన్మేదః ప్రజాయతే,
మేదసోఽస్థి తతో మజ్జా మజ్జాశుక్రస్య సంభవః.

మానవులు భుజించెడి అన్నము జఠరాగ్నిచే రసమై, రసము రక్తమై, రక్తము మాంసమై, మాంసము మేధస్సై, మేధస్సు అస్థియై, అస్థి మజ్జయై, అట్టి మూలిగనుండి శుక్లమేర్పడుచున్నది. కావున ఆహారమెంత సత్యార్జితమై శుద్ధమైనదిగయుండిన సంతానముగూడ ఉత్తములును ఆరోగ్యవంతులు మేధాసంపత్తిగలవారు జన్మింతురు.

ఇదియే దివ్యజననముయొక్క రహస్యము.

క్షణంచిత్తం క్షణంవిత్తం క్షణంజీవిత మావయోః,
యమస్య కరుణా నాస్తి తస్మా జ్జాగ్రత జాగ్రత.

# శ్రీ సద్గురు ప్రాముఖ్యము

శ్రీపరమశివుడు పార్వతీదేవికి సనత్కుమారసంహితయందుపదేశించిన పరమధర్మము.

యస్యదేవే పరాభక్తి ర్యథాదేవే తథా గురౌ,
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః.

పరమభక్తుడైనవానికి యేలాగున తన యిష్టదైవమందు భక్తిగవుండునో, ఆలాగున గురుదేవునియందు శ్రేష్ఠమైన భక్తిగల్గునో, అట్టి మహాత్ముడైనవానికి మాత్రమే యీ వేదాంతార్థము స్పష్టముగ గోచరమగును.

జప స్తపో వ్రతం తీర్థం యజ్ఞో దానం తథైవచ,
గురుతత్వ మవిజ్ఞాయ సర్వంవ్యర్థం భవే త్ప్రియే.

ఓ పార్వతీ! గురువనుగ్రహమును పొందనివానియొక్క జప, తప, వ్రత, తీర్థయాత్ర, యజ్ఞము మొదలగునవన్నియు వ్యర్థములేయగును.

నముక్తా స్తు గంధర్వాః పితృయక్షాస్తు చారణాః,
ఋషయః సిద్ధ దేవాద్యాః గురుసేవా పరాఙ్ముఖాః.

గురుభక్తియందు విముఖులైనవారు ఋషులైనను, గంధర్వులైనను, పితృదేవతలైనను, యక్షులైనను, చారణులైనను, సిద్ధులైనను, దేవలైనను, ముక్తులు గాజాలరు.

మహాహంకారగర్వేణ తపో విద్యా బలేన చ,
భ్రమం త్యేతస్మిన్ సంసారే ఘటీయంత్రం యథా పునః.

గొప్ప అహంకారమగు గర్వముచే తపో విద్యా బలముచే ఎవరు సద్గురువు నాశ్రయించుటలేదో అట్టివారు ఘటీయంత్రమువలె యీ సంసారసాగరములో మరలమరల పుట్టుచు చచ్చుచుందురు.

పతిహీనా యథా నారీ మాతృహీనో యథా శిశుః,
గురుహీన స్తథా ప్రాణీ తస్యజన్మ నిరర్థకమ్.

భర్తలేని స్త్రీ, తల్లిలేని శిశువు ఏలాగున స్వాత్మసుఖము పొందలేరో ఆలాగున గురువులేని మనుజుడును ఇహసుఖముగాని పరసుఖముగాని పొందలేడు. అంతేగాక అట్టివాని జన్మకూడా నిరర్థకమేగాక అనర్థకమునకు కారణమగును.

ఈ విషయమై సద్గురు మళయాళస్వాములవా రిట్లు వచించిరి. అదేమన. జర్మనీ దేశములో ఒక గొప్ప తత్వజ్ఞాని యుండెను. ఆయన తత్వవేత్తల సహాయములేకనే మనుజులకు స్వయముగా జ్ఞానముగల్గునా? లేక తత్వవేత్తల సహాయ మవశ్యముండవలసివుండునా? అని తెలిసికొనుటకు నలుగురు పిల్లలను చిన్నతనములోనే ఒక అరణ్యప్రదేశమున నిర్మింపబడి యుండు గృహమున వుంచి బయటకుపోవుటకు అవకాశము లేని స్థితిలో నుంచెను. ఒక మనుజుడు మౌనముగా వెళ్లి పిల్లవాండ్రకు కావలసిన అన్నపానాదులుమాత్ర మిచ్చుచుండెను. మరియెవరును అచ్చటికి వెళ్లుట కవకాశములేని స్థితిలో నుంచెను. ఈ లాగున యిరువది సంవత్సరములు జరిగినపిమ్మట వారిని గ్రామములోనికి తీసుకొనివచ్చిరి. అప్పుడు పరిశోధన సలుపగా వారికి యేభాషయు తెలిసి యుండలేదు. మృగములవలె అరచుచుండిరి. యేవిధమైన జ్ఞానమున్ను గలిగివుండలేదు. కేవల మడవిమృగములవలె నుండిరి. దీనివలన సద్గురు వవసరమైనది లేనిది తెలియగలరు. అడవిజనులు, కోయవాండ్రు, నీగ్రోజాతులు దీనికి తార్కాణము. నవనాగరికులు ఇంగ్లీషు పాఠశాలలలో చదువుటచేతను

నవలలు చదువుటచేతను దేహశుచిత్వము గృహనిర్మలత్వము నాగరికచిహ్నమని తలంచి పొరపాటు చెందుటచేతను మహాత్ముల నెరుంగజాలకున్నారు. ఈ బాహ్యనాగరికత యుండి ఆత్మసంస్కరణములేనిచో అట్టివారిని సుందరమైన ఒక మృగమో, సౌందర్యముగల ఒకపక్షియో అని మన పూర్వీకులు తలచివుండిరి. నిజముగా హృదయముయొక్క పవిత్రమైన పరివర్తనమే నిజమైన నాగరికతచిహ్నమగును.

ఇంగ్లీషులో తత్వవేత్తలు వ్రాసిన గ్రంథములును శ్రీ ఏసుక్రీస్తు మొదలయినవారి చరిత్రలును చదివినట్లయిన యిట్టి అంధవిశ్వాసమునకు హృదయములో తావుండదు. మన పూర్వీకులు, సన్యాసులు, యోగీశ్వరులు, శ్రీ ఏసుక్రీస్తు, బుద్ధదేవుడు, మహమ్మదునబి మొదలగు మహనీయుల కెంతవరకు బాహ్యాడంబరములుండెనో చరిత్రకారులు నిర్ణయించగలరు. ఆత్మజ్ఞులు దైవమునకన్న గురువు నెక్కువగా ప్రేమింతురు. ఏలనన గురువువలన గలిగిన మహిమవారికి బాగుగ తెలియును.

మరియు, దైవసాధనపరమగు యోగములలోను, ఇతర సాధనలయందు కొన్ని రహస్యములు గలవు. అంతేగాక యెన్నియో విఘ్నములుకూడ గలుగవచ్చును. అందుచేతనే వేదము గురుముఖముగా గ్రహించవలసినదనియే శాస్త్రము చెప్పుచున్నది. అయితే అట్టి నిర్మలమైన గురువులు మీరు చూడని కారణముచేతను, కొందరి మోసకారుల వృత్తిని చూచియు మీకు గురువునందు అవిశ్వాసముగలుగుటకు కారణము, రామ కృష్ణాది అవతారపురుషులకు స్వబోధజ్ఞానము

గల్గియు శ్రీ వశిష్ట సాందీపాది గురువుల నాశ్రయించి కృతార్థులైరి.

గురుదీక్షయనియు, మంత్రదీక్షయనియు, మంత్రపురశ్చరణయనియు వున్నది. మంత్రోపదేశము అయినతరువాత ఆచరించవలసినధర్మములు కొన్నిగలవు. మంత్రదీక్ష యనగా 8 సం॥రములు దీక్షవహించి ఆత్మశుద్ధికొరకును పాపశమనముకొరకును, దైవానుగ్రహముకొరకును జపమాచరించుట. మంత్రపురశ్చరణయనగా అక్షరలక్ష జపించుట. అపుడే మంత్రసిద్ధి లేక మంత్రశుద్ధి గలుగును. దీనివల్ల పూర్వజన్మపాపములన్నియు నశించుటయేగాక, యిష్ట దేవతానుగ్రహముకూడా గల్గును. అట్టి సిద్ధిమైన మంత్రముమాత్రమే ఫలవంతమగును. అంతేగాక అట్టి మంత్రసిద్ధిగలిగినవాడే ఆమంత్రమును మరొకరికి వుపదేశించుట కర్హుడగును. అట్టివారివద్ద వుపదేశము పొందినవారికి ఆ మంత్రము త్వరలో సిద్ధించును. అట్లుగాక వుపదేశించిన, వుపదేశము పొందినవారికి ఫలము లేకపోవుటయేగాక, వుపదేశించినవానియొక్క పుణ్యము, తపస్సుకూడ క్షయించును. కావున యేమంత్రమైనను స్వయముగ అనుష్ఠించకూడదనియు, గురుముఖముగా గ్రహించుకొనవలయుననియు చెప్పుటకు కారణము.

ఈక్షణధ్యాన సంస్పర్శైః మత్స్య కూర్మ విహంగమాః,
పోషయన్తి స్వకాన్ పుత్రాన్ తద్వత్పండితవృత్తయః,

లోకములో మత్స్యములు, కూర్మములు, పక్షులు తమతమ బిడ్డలను దర్శనముచేతను, ధ్యానముచేతను, స్పర్శనముచేతను యే ప్రకారముగా తన స్వరూపము గలుగజేయుచున్నవో ఆ ప్రకారముగానే బ్రహ్మతత్వ జ్ఞానముగల సద్గురువులుకూడా ఆంతరంగిక శిష్యుల ననుగ్రహింతురు. అనగా

మత్స్యములు గ్రుడ్లనుపెట్టి కన్నులతో గ్రుడ్లపై దృష్టి కలిగేలాగున చూచిన వా చూపు తగిలిన గ్రుడ్లన్ని పిల్లలగును. కూర్మములు యెచ్చటనో గ్రుడ్లుపెట్టి నీటిలోనుండి మనస్సులో ధ్యానించిన అవన్నియు పిల్లలై తనదగ్గరకుచేరును. పక్షులు రెక్కలలో గ్రుడ్లనుంచి పొదుగుటవలన గ్రుడ్లు పిల్లలగును. బ్రహ్మనిష్ఠులగు సద్గురువులుకూడా యీ మూడువిధములలో నొకదానిచేతగాని, రెండిటిచేతగాని, మూడింటిచేతగాని యంతరంగభక్తిగల ముముక్షువుల యొక్క యావరణమును నశింపజేసి వారిని తమ ఆత్మస్వరూపముగ జేయుదురు. బ్రహ్మనిష్ఠు లుత్తమాధికారులను హస్తమస్తకసంయోగముచేతను, మధ్యమాధికారులను ఆత్మదృష్టిచేతను, మందాధికారులను వీరు కృతార్థులు గావలెనని తలంచుటచేతను, అత్యంత మందాదికారులను మంత్రోపదేశముచేసి ఏకాంతస్థలమున కొంతకాలము ధ్యాననిష్ఠాదులు చేయించి వారినికూడ తనవలె తయారుచేయుదురు. గురువుచే కలిగెడి ప్రయోజన మిది. వీటికి మీనవృత్తి, కూర్మవృత్తి, విహంగవృత్తులని పేర్లు.

గురువిశ్వాసము లేనివాని మోక్షమార్గగమనము చుక్కానులేని పడవయందలి ప్రయాణమువంటి దగును.

## మానసిక ధ్యానము

ఈ ధ్యానము ఘేరండసంహితయను యోగశాస్త్రమందున్నది.

ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములలోగాని, మరి యెప్పుడుగాని సర్వేంద్రియములనువకాగ్రపరచి నిర్జనస్థలములో సిద్ధాసన, పద్మాసన సుఖాసనములలో దేనియందైనను శరీరము, శిరస్సు మెడ వీటిని కొంచెమెత్తుగను, స్థిరముగాను నిలిపి నిశ్చలుడై కూర్చుండి, సాక్షాత్ తనయొక్క యిష్టదైవము

తనయెదుట ప్రత్యక్షమై నిలచినట్లు బుద్ధిచే భావించి, ఆ దివ్య మూర్తియందు చిత్తము నేకాగ్రపరచి భక్తితో ఆ పరమపురుషుని పాదపద్మములయందు శిరమువంచి నమస్కరించుచు భక్తి జ్ఞాన వైరాగ్య భవబంధనివృత్తిసిద్ధికొరకు ప్రార్థించవలెను. ఇట్లు మానసపూజ ధ్యానాదులు యిచ్చట నచ్చట యనునది లేక నెచ్చటను సర్వావస్థలయందును కనులు మూసినప్పుడును తెరచినప్పుడును చేయవలెను అనంతరము యెంతవరకు సాధ్యమో అంతవరకు తన ఇష్టదైవమందు స్థిరముగా మనసు నిలిపి ధ్యాననిష్ఠలో నుండవచ్చును. మూలమంత్ర జపమిచ్చట మానసికముగా జరుగుచుండవలయును. ఈ సమయమున తన యిష్టదైవము తనయెదుట ప్రత్యక్షమై నిలచినట్లు బుద్ధిచే భావించవలయును. తరువాత నిశ్చలబుద్ధితో శరీరాంతర్యామి యీ భగవంతుడేగాని మరియెవరును గాదని భావించవలయును. అట్లు గాఢమగుభక్తితో తీవ్రధ్యానము చేయుచువచ్చిన తనయొక్క హృదయమున భగవంతుని సహజదివ్యతేజఃపుంజములు కన్పించును. అట్లుగోచరించువరకు మానసపూజ, ధ్యానము జేయవలయును. ఇది సిద్ధియైనచో తన హృదయమున పరమాత్ముడుండియే సమస్తకార్యములు జరుపునట్లు గోచరించును. ఈస్థితి సిద్ధించినయెడల సమస్త ప్రాణుల హృదయమందును తనయొక్క యిష్టదైవమే కన్పించును. ఇది చాలా పరిశుద్ధులకుమాత్రమే సిద్ధించును. మరియు చరాచర ప్రాణికోట్లయందు తన యిష్టదైవమే తాండవమాడుచున్నట్లు కనుపించును. అప్పుడే నిర్భయత్వము దుఃఖనివృత్తి

ఆనందప్రాప్తి సిద్ధించును. మరల తనది పరులది అనునది యేమియు వుండదు. అంతయు భగవంతునిదిగానే అనుభవమగును.

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.
గీ. అ. 18 శ్లో. 61

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి,
సమః సర్వేషుభూతేషు మద్భక్తిం లభతే పరామ్.
గీ. అ 18 శ్లో. 54

శివజ్ఞానం ద్విధాజ్ఞేయం సగుణం నిర్గుణం తథా,
ఆదౌ సగుణ మాశ్రిత్య పశ్చాన్నిర్గుణ మాచరేత్.
తత్వనారాయణము

సగుణజ్ఞాన హీనస్య నహి నిర్గుణ వేదనం.

సగుణధ్యానమందు మనోనిశ్చలత పొందనివారికి నిర్గుణబ్రహ్మము సిద్ధింపదు అని శివయోగరహస్యము.

## ప్రారంభమే పర్యవసానము

నానాదేశములనుండి సముద్రముపై ఓడలో ప్రయాణము చేయువారు ఒకే కేంద్రస్థానమునకు చేరవలసివుండినచో యెనిమిదిదిక్కులనుండి నిర్ణీతస్థానమునకు వచ్చిచేరునట్లు, దృశ్యప్రపంచములో ద్వంద్వములతోగూడిన యీ సంసారదుఃఖసాగరములో మోక్షమనెడు తీరమునకు స్మృతమతాంతరములనెడు నావలపై ప్రయాణముచేయు ముముక్షువులందరున్ను తమయొక్క హృదయములో దైవభావము గలిగి చేరవలసి

వుండును. ప్రతిమానవులు తెలిసిగాని, తెలియకగాని, శోక నివృత్తి, ఆనందప్రాప్తి గలుగవలయునని ఒక విచారము మాత్రము అంతరాత్మలోగలిగి వుందురు. దీనికొరకే సర్వ జనులు సమస్తకార్యములును చేయుచుందురు. ఒక కర్షకుని వద్దకువెళ్ళి విచారించిన, అతడు చేయుపని భోజనాదిసౌఖ్య ములు గలిగి దుఃఖములేనిస్థితిలో నుండుటకొరకని సమాధాన మిచ్చును. ఒక విద్యార్థిని అడిగినచో, అతడును విద్యను ఆర్జించి ధనము సంపాదించి, సుఖజీవితము గడుపుటకొరకని ప్రత్యుత్తర మిచ్చును. కార్మికులుండు స్థలమునకేగి అడిగినచో వారున్ను దుఃఖములేని సుఖజీవితము కొరకే యీపని చేయు చున్నామని తెలుపుదురు.ఒకయంత్రనిర్మాతతో మీప్రయత్న మెందుకొరకని ప్రశ్నించినచో, ప్రజలకు ప్రయాసములేక ప్రయాణము చేయుటకున్ను మాదా రావుత్రాదులు సుఖ ముగా జీవించుటకొరకని సమాధానము చెప్పుదురు. ఒక వైద్యశాస్త్రజ్ఞునితో మీరేమి చేయుచున్నారని యడిగిన, రోగ ముచే సంకటపడుజనులు సౌఖ్యముగా నుండుటకొరకు ఔష ధము తయారుజేయుచున్నానని చెప్పును. ఈలాగున ప్రపంచ ములో యెవరెవరు ఏయేపనులు చేయుచున్నారో వారందరు దుఃఖము గలుగక సుఖముగా జీవయాత్రగడుపుటకొరకేనని ప్రత్యక్షముగా కనుగొనవచ్చును. కామ్యకర్మలు చేయువారిని ప్రశ్నించిన, యజ్ఞాదిక్రతువులు చేయువారిని అడిగిన, స్వర్గ ప్రాప్తికో లేక పుత్రలాభమునకో పాపశాంతికో నని జవాబు యిచ్చుదురు. నిష్కామకర్మలజేయువారి నడిగినచో ఈశ్వర కరుణంగలిగిఅజ్ఞానదోషము నశించి అంతఃకరణశుద్ధిగలిగితద్వారా

జ్ఞానము సిద్ధించి, ఈశ్వరప్రాప్తిగలిగి ముక్తిగలుగుననివచింతురు. ఒక పరమభక్తుని అడిగిన దైవప్రాప్తిద్వారా ఆనందము కొరకని సమాధానము చెప్పును. ఒక యోగాభ్యాసకుని అడిగిన అంతఃకరణములోగల మలవిక్షేపాది దోషములు నశించి మనోమారుతములు వశపడి నిర్వికల్పసమాధిపరమగు సుఖానందము కొరకని ప్రేమతో మనకు జవాబిచ్చును. బ్రహ్మచింతన జేయుచుండు ఒక యతీంద్రుని భక్తితో సమీపించి నమస్కరించి విచారించినను, ఆ మహాత్ముడు మిథ్యాప్రపంచముయొక్క వాసన అంతఃకరణమునుండి తొలగి సత్యమైన బ్రహ్మభావన అవిచ్ఛిన్నతైలధారవలె నిరంతరముండుట కొరకనియు, దానివలన నిత్యముక్తియనెడి మోక్షముగలుగుననియు ప్రశాంతముతో సమాధానముచెప్పి పంపును. ఈ సుఖబుద్ధి, దుఃఖనివృత్తి పసువులకు, పక్షులకు, క్రిములకుకూడా గలదని గ్రహించితిమి. అయితే అట్టి జంతువులకు వివేకజ్ఞానము పూర్తిగా లేనందుచే గాలమునగల యెరను చూచి అపాయమని తెలుసుకొనజాలక చేప మ్రింగుటచే దుఃఖము పొందుచున్నది. ఆలాగున బోనులో పడు ఎలుకలును మరణించుచున్నవి. ఈలాగున మానవులలోకూడా కొందరుమాయామోహితులై దృశ్యవిషయములలో, దుష్టవిషయములలో సుఖముగలదని తలచి దుఃఖితులగుచున్నారు. కనుకనే వివేకజ్ఞానము లేని మానవుడు ఆకృతితో మనుష్యుడై వుండినను మృగప్రాయుడని శాస్త్రము చెప్పెడు రహస్యము.

ఏ ప్రకారము సముద్రజలము సూర్యకిరణములద్వారా సముద్రమునుండి విముఖత్వమునొంది వర్షరూపముగా పరిణ

మించి తిరిగి నదీనదముల ప్రవాహముద్వారా సముద్రమునందే ప్రవేశించి శాంతి నొందుచున్నదో, అదేప్రకారము అనంతాత్మనుండి యీ చరాచరప్రాణికోట్లు అజ్ఞానమనే మేఘములద్వారా ఆత్మనుండి విముఖత్వమునొంది కర్మరూపముగా పరిణమించి యెనుబదినాలుగులక్షల యోనులయందు తిరిగి తిరిగి ప్రారబ్ధమనే ప్రవాహముద్వారా అనంతాత్మయందే లయమునొంది శాంతి పొందుచున్నవి. ఇదియే ప్రారంభమే పర్యవసానమను వాక్యమునకర్థము.

## జప మహిమ

జ్ఞానయోగమునకు జపము ముఖ్యసాధనమై వున్నది. ఈ జపము అర్థసహితముగా జేసిన సమాధిస్థితివరకు తీసుకు వెళ్ళగలదు. జపము సాత్విక భావముతోను శ్రద్ధతోను జేయవలెను. జపించునపుడు మనస్ఫూర్తిగా నీ యిష్టదైవమును హృదయకమలమున నిలుపవలెను. నామరూపము లేవిధముగ విడదీయరానివో అదేవిధముగ జపము ధ్యానము విడదీయరానివి. జపించుకాలమున లోపలను వెలుపలను మీదను క్రిందను అంతటను మంత్రాధిష్ఠానదేవతనే చూచుచుండుము. ఇట్లు భావనాసహితముగ జపింపుము. పతివస్తువునందును ప్రతిస్థలమందును అతడున్నట్లు అనుభవింపుము. ఇట్లు అనుభవపూర్వకముగా జేసిన శీఘ్రకాలములోనే ఆ భగవంతుడు సాక్షాత్కరించును. నీ సంకల్పములు నెరవేర్చును.

ఏ నామమునైనను అక్షరలక్ష జపముచేసిన మంత్రశుద్ధియగును. 13 కోట్లు జపము చేసినచో నీకు శరీరముతో

భగవంతుడు ప్రత్యక్షమగును. నీవు దృఢవిశ్వాసము గలిగి చేసినచో నాలుగైదు సంవత్సరములలో యింతజపము జేయవచ్చును.

సాధారణముగా రోజు1కి వెయ్యిసార్లు మూలమంత్రము జపించినచో ఆ దినమే ప్రత్యక్షఫలమును పొందగలవు. పరీక్షించి చూడుము. దీని యదార్థము అనుభవపరులకే తెలియును. తదితరులకు తెలియదు. జపించునపుడు ప్రతిక్షణము హృదయమున యిష్టదేవుని గుర్తించుచుండవలెను. "మునీనాం హృది దైవతమ్" మునీశ్వరులు హృదయమునందే దైవమును జూచుచున్నారు. అని వుత్తరగీత. జపము ముముక్షువునకు ముక్తిసాధమనకు నిచ్చెనవంటిది. పూర్వీకఋషులందరు జపము నాశ్రయించియే ఆత్మజ్ఞానమును బడసిరి. వారి మహాశక్తికి జపమే కారణము. ఈ జపమే భారతఋషులకు భూతభవిష్యద్వర్తమానకాల దివ్యదృష్టిని, అన్యావశీకరణ శక్తిని ప్రసాదించినది. ఆస్తికునియొక్క అంత్యదశ నాస్తికత యగుటచే జపముయొక్క ఫలము పొందక విఫలులగుచున్నారు. ఇది జ్ఞానజ్యోతికి తైలమువంటిది. జపముయొక్క ఫలవైపరీత్యము చెప్పవలవిగాదు. నీకు హితబాంధవవంశవర్ధనుడు నీ యిష్టదైవమేనని యెరుంగుము. నీ హృదయాధిష్ఠిత దేవునితోనే క్రీడించుము. భారమునంతయు ఇష్టదైవముపై వదలుము. అప్పుడు అతడే నీ కార్యములన్నియు భృత్యునివలె చూచుచుండును. నేడే పరీక్షింపుము.

ఆయువు సమాప్తియగుచున్నది. ప్రయాణము సిద్ధముగా వున్నది. రాత్రి 4 గంటలకు లేచి నీ యిష్టదేవతామంత్రము

జపింపుము. జపమువలను,సంకీర్తనమువల్లను, యెటువంటి కఠిన రోగములైనను హరించును. జపమువల్ల రోగాణువులెల్లయు నశించి శరీరమంతయు తేజోవంత మగును. మంత్రము జపముచేయునపుడు సంఖ్య పూర్తికొరకుచేయరాదు. భావనా సహితముగా జేయవలెను. అప్పుడే జపము ఫలవంతమగును. భావములేని జపమునకు ఫలమున్నచో భిక్షకారులు అన్నము కొరకు లక్షలకొలది జపించుచుందురు. వారా ఫలమును పొందుట లేదు.

మంత్రార్థం మంత్రచైతన్యం యో నజానాతి సాధకః,
శతలక్ష ప్రజప్తాపి తస్య మంత్రో నసిధ్యతే.

ఈ జపము వాచక ఉపాంశు మానసిక భేదములతో త్రివిధము. ఇది ఒకదానికంటె నొకటి వేయిరెట్లధికఫలము గలిగివున్నది. గాన మానసిక ధ్యానము అభ్యాసము చేయవలెను.

ఓమ్ శాన్తి శాన్తి శాన్తిః

## జీవుని పరిణామావస్థ

బాల్యకాలమున యాటలలో సౌఖ్యముగలదనుతలంపు గలిగి వుండును. అంతకుమించిన సుఖ మాతనికి కన్పించదు. తరువాత విద్యాభ్యాసములలో మనస్సులగ్నమయి దీనికి మించిన ఆనందము లేదని తలచును. పిదప యౌవ్వనదశ ప్రాప్తించును. ఇది ఆపత్తులన్నిటికి తగిన కాలము. మాయ యొక్క మహిమలన్నియు అతనియందు ప్రదర్శింపబడు

చుండును అపుడు స్త్రీపురుషులు వైవాహిక సుఖముకంటె మించిన సుఖము ప్రపంచములో లేదని తలచుచుందురు. కొంతకాల మిట్లు మలినవిషయములలోనే కాలముగడపుచు యెట్టి హీన విషయములుకూడ మహాశ్రేష్ఠముగా భావించి శరీరములోగల నవద్వారములనుండి సద్భవించెడు మలములన్నియు పీయూష ముకన్న ఎక్కువ మహిమగలవని మాయాప్రభావముచే తలంచును. అకటా! యెంత మేథాసంపత్తిగలవానిని కూడ ఏమియు తెలియని మూఢునిగాచేయు అవిద్యయొక్క శక్తి యేమనిచెప్పవచ్చును? కొంతకాలము గడచినపిమ్మట సుకృత విశేషముండిన అంతఃకరణము కొంచెము శుద్ధమై పై వర్ణించిన వన్నియు ఇంద్రజాలమువలె నశ్వరములనియు, అంతేకాక దుఃఖహేతువులనికూడ తెలచి, ఇప్పటి కెన్నిమార్పులు గలిగి నవోనని లెక్కపెట్టుకొనును. దైవకృపచే దీనినుండి నివృత్తిని బొందెడిమార్గము కలదాయని విచారించి ఈశ్వరప్రార్థన, పుణ్యకర్మలు, తీర్థయాత్రలు, దివ్యమంత్రజపములు మొదలగు పవిత్రమార్గములలో ప్రవేశించును. అనంతరము అంతఃకరణ శుద్ధి మరింత యెక్కువై మాయయొక్క మహిమయే యిదంతయునని తెలసి విరక్తిగలిగి యేకాంతస్థలమున ప్రవేశించి తపస్సు, యోగము మొదలగు ముఖ్యసాధనములను ఆత్మ ప్రాప్తికై తీవ్రవేగముతో వహించును. ఆ తరుణమున దానికి మించినది లేదనియు, యింతవరకు ప్రారంభించిన జప ప్రార్థన వ్రతాదులు యెక్కువకావని తలచును. ఇప్పటికెన్నిమార్పులు గలిగినవో యోచించుకొనవలెను. తరువాత యోగనిష్ఠ, తపస్సుచే అంతఃకరణ మరింతశుద్ధమై వీటివలన యథార్థ

తత్త్వము బోధపడజాలదని ఉత్తమ బ్రహ్మనిష్ఠులగు గురువుల నాశ్రయించి నిజమగు వస్తుతత్త్వము తెలుసుకొనవలెనని బోధ గలుగును. అపుడీ అంతఃకరణమును, మనస్సును, బుద్ధిని ప్రకాశింపజేయు వస్తువొకటి వీటన్నిటికంటె పై భాగమున నే వికారము కలుగక స్వయంప్రకాశమై యుండుననియు, బ్రహ్మాది స్తంబపర్యంత మన్నిటిలో అంతర్యామియై యున్నదని సద్గురువుద్వారా తెలుసుకొనును. అత్తరి ఆ సత్యస్వరూపమగు ఆత్మ ఈశ్వరుడేననియు, అంతట ప్రకాశించునది ఆపరబ్రహ్మమే నని మహావాక్యవిచారణ స్వానుభవమునకు వచ్చువరకు ఆత్మానుసంధానపరుడై తాను శివజీవైక్యానుభవముగలిగిన వాడననియు, జననమరణరహితుడనియు బోధముగల్గును. అదే పరమపావిత్ర్యము. అదే శివము; ఆనందము; దైవము.

## శుష్కవేదాంతుల స్వభావము

వాచావిరక్తాః క్రియయానురక్తాః దారేషు పుత్రేషు ధనేషు రక్తాః,

విత్తార్జనే విశ్రుతవేషభాషాః వేదాన్తవాక్యాని వదంతి మూఢాః.

సంభాషించుటలో విరక్తులై విషయాదులలో బద్ధులై దారేషణ పుత్రేషణ ధనేషణ లను పాశములచే గట్టబడి విత్తార్జనముకొరకు వేషభాష తోగూడి జనులను మోసపుచ్చుచుందురు.

యథా చతుర్భిః కనకం పరీక్ష్యతే నికర్షణ చ్ఛేదన తాప తాడనైః,

తథా నరాణాం పురుషః పరీక్ష్యతే గుణేన శీలేన గణేన

సువర్ణ పరీక్షకులేలాగున సంశయముండిన తెగగొట్టుట మరల కరిగించుట సుత్తితో కొట్టుట వరిపిడిరాతియందు గీచి నిజానిజములు ఏలాగున పరీక్షింతురో ఆలాగున ఒకరిని పెద్దలుగా గ్రహించుటకు నాలుగువిధములుగా పరీక్షచేయవలయును. వారి గుణముచేతను, శీలముచేతను జీవరాసులపై దయయు సత్యధర్మములతో గూడివున్నారా? బ్రహ్మవేత్తల పరంపరలో జేరినవారా? అనుష్ఠాననిష్ఠలతో గూడినవారాయని పరిశీలించి గురువుగా గ్రహించవలెను. అట్లుజేయక గిల్టునగలను బంగారమని భ్రమించిన వారి గతియే వీరికిన్ని గలుగును అని బ్రహ్మజ్ఞానచింతామణి చెప్పుచున్నది.

**అవిద్యాయా మంతరే వర్తమానాః స్వయం ధీరాః**
**పండితంమన్యమానాః,**
**జంఘన్యమానాః పరియంతిమూఢాః అంధేనైవనీయ**
**మానా యథాంధాః.**

విషయాదులలో వుండి తమకుతామే యతీంద్రియజ్ఞానులమని గర్వించెడివారలు జననమరణము లను మిట్టపల్లములలోబడి కాలచక్రమునందు తిరుగుచుందురు. అట్లున్నవారిని గురువుగాజేసుకొనుట రేయెటువంటిదనగా గాఢాంధకారములో నంధునిచేతులు పట్టుకొనిపోవు మరియొక గ్రుడ్డివానివలె నుండునని దశోపనిషత్తు చెప్పినది.

**శరీరం సురూపం తథా వా కళత్రం యశశ్చారుచిత్రం**
**ధనం మేరుతుల్యం,**
**మనశ్చే న్నలగ్నం హరేరంఘ్రిపద్మే తతః కిం తతఃకిం**
**తతఃకిం తతఃకిం.**

మనసు హరి పాదపద్మములయందు బొందని మనుజుడు సుందరమగు శరీరమును, సుశీలయగు భార్యయు, విచిత్రమగు యశస్సు, మేరుసమానమగు ధనము గలిగివుండినను,పరమునకు ఏమిప్రయోజనము? ఏమి సహాయపడును?

యస్యనాస్తి స్వయంప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిమ్,
లోచనాభ్యాం విహీనస్య దర్పణం కిం కరిష్యతి.
సముద్రతరణే యద్వత్ ఉపాయో నౌః ప్రకీర్తితా,
సంసారతరణే తద్వత్ బ్రహ్మచర్యం ప్రకీర్తితమ్.

---

## శీలావతి పతివ్రతా మహిమ

ఉగ్ర తపస్వియను ముని శీలవతి యను పేరుగల ఋషి కన్యను వివాహముచేసుకొని అరణ్యమున పవిత్రమగు ఆశ్రమము నిర్మించి ధర్మపత్నీసమేతుడై తపమాచరించుచు భార్యయొక్క పాతివ్రత్యధర్మమును తెలిసికొనుటకు తన మహిమచే కుష్ఠు వ్యాధిగలవానినిగా జేసుకొనెను. నడచుటకు శక్తిలేని స్థితిలో నటించి ఒకనాటిరాత్రి కారుచీకటిలో గ్రామమున నొక గృహమునకు వెళ్ళవలెనని భార్య తన భుజముపై ఎత్తుకొనిపోవుచు, శూలమున పడియున్న మాండవ్య మహాముని పాదములకు యా ముని శిరస్సు తగిలి చాలబాధ గలిగినందువలనచే తనకు ఈ బాధగలిగించినవాడు రేపు సూర్యోదయము కాగానే మరణించునటుల శాపమిచ్చెను. ఆ ముని దివ్యదృష్టితో మృత్యువు సంభవించునని యెరిగి విచారించుచుండగా, శీలావతి, భర్తతో మునీంద్రా! మీరు ఆజ్ఞ యిచ్చినచో సూర్యుడుదయింపకుండునటుల చేసెదననగా అలాగున చేయుమ్మ ననెను. శీలావతి సూర్యుని గురించి నిలబెట్టిన విగ్రహమువలె చిత్తైకాగ్రతతో. ఓ తేజోమూర్తీ! నీవు ఉదయించితివేని మాండవ్యమునియొక్క శాపాగ్నివలన నా భర్త మరణించును కాన, నాకు మాంగల్యహాని గలుగనీయక పతిభిక్ష

పెట్టుమని తప మొనరింప ప్రారంభించెను. మూడు దినముల వరకు సూర్యు డుదయింపలేదు. వైదికకర్మలన్నియు ఆగి పోయెను. దేవతలందరు సూర్యోదయము కాకుండుటకు కారణము తెలియక అటునిటు పరుగులెత్తుచు పరిభ్రమించుచుండగా శీలావతియొక్క తీవ్రతపస్సువలన సూర్యు డుదయించ లేదని తెలిసికొని త్వరలో దేవతులు దేవేంద్రుడు సృష్టికర్త యగు బ్రహ్మదేవుని సమీపించి వృత్తాంతము తెలియ పరచిరి. బ్రహ్మదేవుడు దీని నివారణోపాయము తనచే సాధ్యము గాదని బ్రహ్మదేవునితో సహా దేవతలందరు కైలాసవాసియగు పరమశివుని సమీపించి విషయమంతయు సవిస్తరముగా చెప్పిరి. అపుడు కాలకంఠుడు మనమందరము శ్రీమన్నారాయణుని దగ్గరకు వెళ్ళినచో మాత్రమే యీ ఘోర విపత్తు నివర్తించునని తెలిపి శ్రీవైకుంఠనాథుడగు శ్రీమన్నారాయణమూర్తివద్దకు బ్రహ్మతోసహా ఈశ్వరుడును వెళ్లి వీరియొక్క ఆగమనము విస్తరించి తెలిపిరి. నారాయణమూర్తి యీ పని నాకున్ను సాధ్యముకాదనిచెప్పి, అత్రి మహాముని ఆశ్రమమునకు మనమందరము వెళ్ళినచో మాత్రమే యీ ఆపత్తు నివర్తించునని చెప్పి శ్రీ విష్ణువున్ను, బ్రహ్మాదిదేవతలందరున్ను అత్రిమహర్షి ఆశ్రమమునకు వెళ్లిరి. బ్రహ్మాదిదేవత లందరికి అత్రిమహాముని నమస్కరించెను. అపుడు బ్రహ్మాదిదేవత లందరు శీలావతియొక్క తపఃప్రభావముచే సూర్యు డుదయింపక పోవుటవల్ల నిత్యనైమిత్తిక యజ్ఞాదికార్యములన్నియు జరుగుటలేదు. దీనికుపాయమేదియో ఆనతియ్యవలయునని అత్రిమహర్షితో చెప్పిరి. ఆ మాటలు

విని, అత్రిమహర్షి మహాపతివ్రతయగు తన ధర్మపత్నితో బ్రహ్మ విష్ణు రుద్ర ఇంద్రాది దేవతలందరు మీ దర్శనార్థమై వచ్చియున్నారనియు, తపస్వినియగు శీలావతిమాంగల్యమునకు హానిగలుగక సూర్యు డుదయించి యజ్ఞాదికార్యములన్నియు నిర్విఘ్నముగా జరుగుట కుపాయమెద్దియో ఆలోచించవలయుననియు అనసూయాదేవితో చెప్పెను. దానిని విని వెంటనే త్రిమూర్తుల కడకేగి మనఃపూర్వకముగా నమస్కరించి మీ అనుగ్రహముండిన శీలావతిపతికి భంగము కలుగక సూర్యు డుదయించులాగున చేసెదనని వచించి అత్రిమహాముని కి ప్రదక్షిణ నమస్కార మొనరించి ఆజ్ఞను పొంది బ్రహ్మ విష్ణు శివ ఇంద్రాది దేవతలతో సహా శీలావతి తపమాచరించు ఉగ్రతపః ప్రదేశమునకు జనిరి. అప్పుడు నిత్యానుష్ఠానపరాయణు శీలావతితో అనసూయ 'తల్లీ! తపము చాలించుము. నీ తపః ప్రభావముచే సూర్యు డుదయించకపోవుటవలన సత్పురుషుల నిత్య కర్మలన్నియు ఆగిపోయినవి. ప్రపంచమంతయు అంధకారమైనది. చోరులు విజృంభించి జనులను బాధపెట్టుచుండిరి. పశువులు మేతలేక గోడుగోడున అరచుచున్నవి. ఈలాంటి అకాలప్రళయము యేకాలము జరిగివుండలేదు.' అనసూయాదేవి వాక్యములు విని శీలావతి ధ్యానమునుండి బహిర్ముఖమునగలదై 'ఓ దేవీ! నా భర్తకు ఆపత్తును గలుగక సూర్యు డుదయించు వుపాయముండిన తపము నిలిపెద.' ఆ వాక్యములు విని అనసూయ 'నీ మాంగల్యమునకు చెరుపుగలుగక సూర్యు డుదయించులాగున చేసెద' నని తెలుపగా శీలావతి తన తపమును వుపసంహరించుకొని సూర్యు డుదయించులాగున

ప్రార్థించగా సూర్యోదయ మయ్యెను. వెంటనే శీలావతి పతియగు యా ముని ప్రాణవిరహితుడై భూమిపై పడెను. అపుడు అనసూయాదేవి శీలావతితో భయపడకుము. లోకమును సృష్టించి పాలించి సంహరించు శక్తిగల త్రిమూర్తులు వచ్చి యుండగా నీభర్తకు ప్రాణమిచ్చి రక్షించుట కశక్తులగుదురా? అపుడు బ్రహ్మదేవుడు జలమును అభిమంత్రించి యా ముని ముఖమండలమున ప్రోక్షింపగా లేచి కూర్చునెను. దేవాలయములలో గంటలు మ్రోగెను. అభిషేకపూజోత్సవములు విశేషముగా జేయబడెను. వేదఘోషములు అంతటను విన వచ్చినవి. త్రిమూర్తులు యా మునిశిరమున హస్తముంచి ఆశీర్వదించిరి, అపుడా ముని సువర్ణకాంతితో సమానమగు దేహముగలవాడాయెను. త్రిమూర్తులు దేవతలు వారివారి స్థానములకు వెళ్ళిరి. ఉగ్రతపోముని శ్రేష్ఠుడగు యామునియు, పుణ్యవతియగు శీలావతియు భూలోకమునందు బహుకాలము నివసించి, అంత్యకాలమున బ్రహ్మపదవి బొందిరి. ఈపావన చరిత్రము చదివినవారును, వినినవారును సదా యిహపర సుఖము ననుభవించెదరు.

# గార్గి

## (యాజ్ఞవల్క్య మహర్షితో)

## స్త్రీపురుష శబ్దమునకు అంతరార్థము

యథార్థముగా స్త్రీపురుష శబ్దమునకు నిజార్థము చెప్ప వలసినచో యీ చర్మచక్షువులకు గోచరించు స్త్రీపురుషులు స్త్రీపురుషులు కారు. ఆత్మదృష్టిచే విచారించిన స్త్రీలలో పురుషు లున్నారు. పురుషులలో స్త్రీ లున్నారు. వారిభేదము స్తన కేశాది అవయవముల ననుసరించికాదు. దేహేంద్రియాది మనోవృత్తుల కధీన అనధీనవృత్తుల ననుసరించివున్నవి. అనగా స్త్రీయొక్క స్వభావము అబలత్వముచే స్త్రీ తన స్వాధీనమనియు, పురుషలక్షణము బలముగుటచే స్త్రీ తన స్వాధీనమనియు కొందరు విషయలంపటులగు మందశాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఇది చాల తప్పు. దీని రహస్యార్థ మేమన ఎవనికి సర్వత్ర వ్యాప కమైన ఆత్మజ్ఞానముగలదో అతడే పురుషుడు, ఆత్మజ్ఞానము లేని అజ్ఞానజీవులు నపుంసకులుగాను, స్త్రీలుగాను వున్నారు. ఆ స్త్రీలయందును యీ అజ్ఞాన జీవరూపిణులగు స్త్రీలు కుల స్త్రీలవలెగాదు; వారాంగనాసమానముగా వున్నారు. ఎట్లు వారాంగన వివిధ పురుషులతో వుపభోగములు చేయుచున్నదో అట్లే, అజ్ఞాన జీవరూపిణులగు స్త్రీలుకూడా కామ క్రోధ లోభ మోహాది వివిధపురుషులతో వుపభోగములు చేయుచున్నారు. మరియు స్త్రీలయందు పురుషసంబంధముచే యెట్లు గర్భధారణ యగుచున్నదో అట్లే అజ్ఞాన జీవరూపిణులగు స్త్రీలయందును కాలరూప పురుషసంబంధముచే దుఃఖభయముగు జన్మగర్భ

మన్నది. అనగా, ఎవరు కామక్రోధాదులచే ధర్మ
తొలగి దయకు దూరులై కామపరవశులై తిరుగు
చున్నారో, వారే నిజముగా స్త్రీలు. అవయవాంగభేదములచే
మాత్రము స్త్రీపురుషులు కారు.

ఎందరో స్త్రీపురుషులు వ్యాకరణశాస్త్రమందును,
మీమాంసా శాస్త్రమందును, న్యాయశాస్త్రమందును, అట్లే
సకలగ్రంథములయందును ప్రవీణులై వుండినను, ఆత్మప్రాప్తి
సాధకమైన వేదాంతశాస్త్రమందుమాత్రము కుశలత కన
బడుటలేదు. శాస్త్రపఠనము చేసియు స్వమనంబున అల్పము
నను శాస్త్రార్థమును ధారణచేయక మద్యము త్రావిన వాన
రమువలె అజ్ఞానమదిరాపానముచే శాస్త్రవిరుద్ధములగు నానా
చేష్టలను చేయుచున్నారు.

తృష్ణయే దీనికి కారణము. ముక్కుకు త్రాడుగుచ్చ
బడిన యెద్దువలె తృష్ణయను కృష్ణసూత్రముచే అజ్ఞానజీవులు
బంధింపబడుచున్నారు,

శివార్చన విహీనోయః పశురేవ నసంశయః,
నతు సంసారచక్రేస్మిన్ అజస్రం పరివర్తతే.

---

## ధర్మాడంబరము

తన్ను భక్తుడనియు, సాధుపుంగవుడనియు, ధార్మికు
డనియు ఇతరులు తలంపవలయునను కోరికచే ఇతరులు తన్ను
సమీపించినపుడెల్ల ధర్మభావముల వెల్లడించుచు బాహ్య
వేషములకొరకు ప్రయత్నించుచుండును. దీనివలన నాంత

రంగిక ధర్మభావము క్రమక్రమముగా తగ్గుటయేగాక అనేక విధములగు మనోవికారము లుత్పత్తియగును.

ఈ విషయమై కేశవచంద్రసేను చెప్పినది చూడుడు.

'భక్తులారా! మీ వేషమును హేయముగా నుంచి, హృదయమును పవిత్రముగా నుంచుకొనుడు. మీహృదయము రాగద్వేషములచేతను, అసత్యసంభాషణచేతను పూరించి, లోకులసమ్ముఖమున సాధుపురుషుడని పరిచయము గలిగించి నేనొక మహాత్ముడనని తలంచినచో ప్రకృతిలో పాపాత్ముల కన్న మహాపాతకి యని గ్రహింతురు గాక'

## ఏసు క్రీస్తు

మీ ఆత్మను దాచుకొనుడు. బాహ్యచిహ్నములవలన లోకులప్రశంసను, అనురాగమును సంపాదింపవలయునని ప్రయత్నింపకుడు. ప్రియమైన పదార్థమును బజారునందు విక్రయించుట కెవ్వడు ప్రయత్నించడు. ధర్మాసక్తిగలవాడు, సత్యాసక్తిగలవాడు ధర్మము ధర్మము అనిగాని; సత్యము సత్యము అనిగాని పలువరింపడు. యథార్థభక్తుని హృదయము వారుచేయు కార్యకలాపములయందే తెలియును. అగ్నిని గప్పిపెట్టుటకు వీలు లేనట్లు ధర్మమును గప్పిపెట్టుటకు వీలు లేదు. ధర్మాడంబరము శూన్యహృదయమును తెలుపుచుండును.

అగాధజల సంచారీ వికారీ నైవ రోహితః
గండూష జల మాత్రేణ శఫరీ ఫర్ఫరాయతే.

# పూజా విధానము

## (సంకల్పము)

ఓమ్. శుభాభ్యాం శుభతిథౌ శోభనముహూర్తే అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వన్తరే కలియుగే ప్రథమపాదే జమ్బూద్వీపే భారతవర్షే భరతఖణ్డే మేరోః దక్షిణదిగ్భాగే అస్మిన్ పుణ్యక్షేత్రే వర్తమానే వ్యావహారిక చాంద్రమానేన ... నామ సంవత్సరే ... ఋతౌ ... మాసే ... పక్షే ... తిథౌ, ... వాసర శుభ నక్షత్ర శుభయోగ శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ పరబ్రహ్మగోత్రోద్భవస్య స్వయంప్రకాశ జ్ఞాననామధేయస్య సమస్త పాపనివృత్త్యర్థం సర్వదురితక్షయద్వారా పుణ్యఫలప్రాప్త్యర్థం ఆత్మశుద్ధ్యర్థం అస్మాకం వంశానాం దైవప్రీత్యర్థం అస్మాకం సర్వేషాంబుద్ధిః ధర్మకార్యేనిమగ్నార్థం భూమండలే చరాచరప్రాణికోటీనాం క్షేమసిధ్యర్థం భక్తి జ్ఞానవైరాగ్య ఫలసిధ్యర్థం మమ అభీష్టసిధ్యర్థం ప్రతిబంధరహిత బ్రహ్మసాక్షాత్కార జ్ఞానసిధ్యర్థం శ్రీరామచంద్రస్వామిదేవతాముద్దిశ్య శ్రీరామచంద్రస్వామి దేవతాప్రీత్యర్థం శ్రీరామపూజాంకరిష్యే. (అథవా ఈశ్వరపూజాంకరిష్యే.)

సంకల్పమునకు ముందుగా పుష్పములు తులసీదళములు అక్షింతలు, సుగంధద్రవ్యములు సిద్ధముగావుంచికొని దీపారాధనచేసి నమస్కరించి అనంతరము సంకల్పముచెప్పి; సంకల్పానంతరము విఘ్నేశ్వరనామములు 24 చెప్పి, తదుపరి కేశవనామములు పుష్పములతో అర్చనచేయవలెను.

## విఘ్నేశ్వర నామములు

ఓమ్ సుముఖాయ నమః
ఏకదంతాయ నమః
కపిలాయ నమః
గజకర్ణకాయ నమః
లంబోదరాయ నమః
వికటాయ నమః
విఘ్నరాజాయ నమః
గణాధిపతయే నమః
ధూమకేతవే నమః
గణాధ్యక్షాయ నమః
ఫాలచంద్రాయ నమః
గజాననాయ నమః
వక్రతుణ్డాయ నమః
శూర్పకర్ణాయ నమః

హేరమ్బాయ నమః
స్కందాగ్రజాయ నమః
మూషకవాహనాయ నమః
మోదక హస్తాయ నమః
చామరకర్ణాయ నమః
విళంబితసూత్రాయ నమః
వామనరూపాయ నమః
ఈశ్వర పుత్రాయ నమః
వరసిద్ధి వినాయకాయ నమః
బ్రహ్మనిష్ఠాయ నమః

## కేశవ నామములు

ఓం కేశవాయ నమః
నారాయణాయ నమః
మాధవాయ నమః
గోవిందాయ నమః
విష్ణవే నమః
మధుసూదనాయ నమః
త్రివిక్రమాయ నమః
వామనాయ నమః
శ్రీధరాయ నమః
హృషీకేశాయ నమః
పద్మనాభాయ నమః
దామోదరాయ నమః
సంకర్షణాయ నమః
వాసుదేవాయ నమః
ప్రద్యుమ్నాయ నమః
అనిరుద్ధాయ నమః
పురుషోత్తమాయ నమః
అధోక్షజాయ నమః
నారసింహాయ నమః
అచ్యుతాయ నమః
జనార్ధనాయ నమః
ఉపేంద్రాయ నమః
హరయే నమః
కృష్ణాయ పరమాత్మనే నమః
సద్గురు పరబ్రహ్మణే నమః

ఏ గృహమున ప్రతినిత్యము పూజార్చన దీపారాధన జరుగుచున్నదో అట్టి గృహము లక్ష్మీనివాసమని శివుడు పార్వతికి తెలిపెను. అట్టిగృహములే పావనములైనవని మహా రుషులు అనేకమారులు చెప్పియుండిరి. యతీశ్వరులు యిట్టి పావన గృహములందే భిక్ష తీసుకొనవలెను. పూజచేసిన అనంతరము భుజించు పావనస్త్రీలను దేవతలు ఋషులు పితరులు ఎల్లపుడు యాశించుదురు.

## శ్రీ గుర్వష్టోత్తర శతనామావళిః.

1 ఓం ఆనందవపుషే నమః
2 ఆచార్యాయ నమః
3 ఆదిమధ్యాన్తరహితాయ
4 దయానిధయే
5 సత్యజ్ఞానానందరూపాయ
6 సదాచారాయ
7 యోగయోనయే
8 ప్రజ్ఞానఘనాయ నమః
9 పంచకోశవిలక్షణాయ
10 కోటికందర్పసుందరాయ
11 కృపావీక్షణాయ నమః
12 అతనవే నమః
13 ఆనందాయ
14 అజయ
15 ఇచ్ఛానిచ్ఛరహితాయ
16 అభోక్త్రే
17 అద్వంద్వాయ
18 అచింత్యాయ
19 గుణత్రయ వివర్జితాయ
20 గుహాశయాయ
21 జ్ఞాతృజ్ఞానజ్ఞేయసాక్షిణే
22 నిరంజనాయ నమః
23 నిత్యబుద్ధాయ నమః
24 అగ్రగణ్యాయ నమః
25 అక్షరాయ
26 ఉదాసీనాయ
27 ఉపదేష్ట్రే
28 అచలాయ
29 ఓం జ్ఞానదేశికాయ
30 తత్వమస్యాది వాక్యార్థ లక్ష్యాయ నమః
31 నిష్కళాయ
32 తారకాయ
33 తత్వబోధకాయ
34 నిత్యశుద్ధాయ
35 నిత్యముక్తాయ
36 జ్ఞానలింగాయనమః
37 స్వయంప్రకాశాయ
38 జన్మజరామృత్యునివార కాయనమః
39 నిర్లేపాయనమః
40 అద్భుతచారిత్రాయ
41 అద్వేష్ట్రేనమః
42 ఊర్ధ్వరేతసే
43 సదసత్ రహితాయ
44 సాధుగమ్యాయ
45 సర్వాత్మనే
46 శాంతాయ
47 అనన్తశక్తయే
48 నిష్ప్రపంచాయ
49 ఈశ్వరాణామధీశాయ
50 వేదాంతవేద్యాయ
51 షడూర్మివర్జితాయ
52 షడ్భావరహితాయ
53 అమృతాయ
54 అంతర్యామిణే

# గుర్వష్టోతర శతనామావళి

55 ఓం అపరిచ్ఛేద్యాయ
56 క్షమిణే నమః
57 కూటస్థాయ నమః
58 కైవల్యదాయకాయ
59 కపటవర్జితాయ
60 కాలాతీతాయ
61 అవస్థాత్రయసాక్షిణే
62 అప్రమేయాయ
63 అద్వయాయ
64 అవ్యక్తాయ నమః
65 కూటాయ
66 గ్రంథిత్రయవిమోక్షణాయ
67 చిన్మాత్రాయ
68 జ్ఞానగమ్యాయ
69 బ్రహ్మానందాయ
70 భవాబ్ధితారణాయ
71 పరాత్పరాయ
72 తత్వమర్థాయ
73 దుష్టదూరాయ
74 దురాచారనాశనాయ
75 అభాస్వరాయ
76 విధి విష్ణు శివాకృతయే
77 అజల్లక్షణ విలక్షణాయ
78 అజడాయ
79 అపారసంసారార్ధవిఘట్టనాయ
80 అమన్యవే
81 అమోఘవైభవాయ
82 ఓం అభయంకరాయ
83 వరదాయ
84 ముక్తిరూపాయ
85 శాశ్వతాయ
86 అఖండమహిమాంబోధయే
87 అఖండబోధాయ
88 మనోవాచామగోచరాయ
89 పరిపూర్ణాత్మనే
90 బాహ్యాంతరస్థితాయ
91 భక్తిశ్రద్ధాధ్యానగమ్యాయనమః
92 నిరహంకృతయే
93 నిర్వికారాయ
94 నిర్వైరాయ నమః
95 లక్ష్యాలక్ష్యవర్జితాయ
96 నిర్వికల్పాయ
97 అవ్యయాయ
98 అనంతరూపాయ
99 అనుత్తమాయ
100 దక్షిణాభిముఖాయ నమః
101 అద్భుతాయ నమః
102 అలింగాయ
103 నిస్సంగాయ
104 నిర్వాణసుఖదాయ
105 నిగమాతీతాయ నమః
106 నిత్యాయ
107 ధర్మవతాంవరాయ
108 శ్రీగురుమూర్తయే నమః

శ్రీ గుర్వష్టోత్తర శతనామావళిః సమాప్తా.

# శ్రీ రామాష్టోత్తర శతనామావళిః.

(ధ్యానము)

1. ధ్యాయే చా జానుబాహుం ధృతశరధనుషం బద్ధపద్మాసస్థం
పీతంవాసోవసానం నవకమలవళస్పర్ధినేత్రం ప్రసన్నం,
వామాంగారూఢసీతాముఖకమలమిళల్లోచనం నీరదాభం,
నానాలంకారదీప్తం దధత మురు జటామండలం రామచన్ద్రమ్॥

1 ఓమ్ శ్రీరామాయనమః
2 రామభద్రాయ
3 రామచన్ద్రాయ
4 శాశ్వతాయ
5 రాజీవలోచనాయ
6 శ్రీమతే
7 రాజేంద్రాయ
8 రఘుపుంగవాయ
9 జానకీవల్లభాయ
10 జైత్రాయ
11 జితామిత్రాయ
12 జనార్దనాయ
13 విశ్వామిత్రప్రియాయాయ
14 దాంతాయ
15 శరణత్రాణతత్పరాయ
16 వాలిప్రమథనాయ
17 వాగ్మినే
18 సత్యవాచే
19 సత్యవిక్రమాయ
20 సత్యవ్రతాయ
21 వ్రతధరాయ
22 సదాహనుమదా శ్రితాయ
23 కౌసలేయాయనమః
24 ఖరధ్వంసినే
25 ఓమ్ విరాధవధపండితాయ
26 విభీషణపరిత్రాత్రే
27 హరకోదండనాయ
28 సప్తతాళప్రభేత్త్రే
29 దశగ్రీవశిరోహరాయ
30 జామదగ్న్య మహాదర్పదళనాయ
31 తాటకాంతకాయ
32 వేదాంతసారాయ
33 భవరోగస్య భేషజాయ
34 దూషణత్రిశిరోహంత్రే
35 త్రిమూర్తయే
36 త్రిగుణాత్మకాయ
37 త్రివిక్రమాయ
38 త్రిలోకాత్మనే
39 పుణ్యచారిత్రకీర్తనాయ
40 త్రిలోకరక్షకాయ
41 ధన్వినే
42 దండకారణ్యవర్తనాయ
43 అహల్యాశాపశమనాయ
44 పితృభక్తాయనమః
45 వరప్రదాయ
46 జితేంద్రియాయ
47 జితక్రోధాయ
48 జితమిత్రాయ

49 ఓం జగద్గురవే
50 ఋక్షవానరసంఘాతినే
51 చిత్రకూటసమాశ్రయాయ
52 జయంతత్రాణవరదాయ
53 సుమిత్రాపుత్రసేవితాయ
54 సర్వదేవాదిదేవాయ
55 మృతవానరజీవనాయ
56 మాహామారీచహంత్రే
57 మహాదేవాయ
58 మహాభుజాయ
59 సర్వవేదస్తుతాయ
60 సౌమ్యాయ
61 బ్రహ్మణ్యాయ
62 మునిసంస్తుతాయ
63 మహాయోగినే
64 మహోదరాయ
65 సుగ్రీవేప్సితరాజ్యదాయ
66 సర్వపుణ్యాధికఫలాయ
67 స్మృతసర్వాఘనాశనాయ
68 ఆదిపురుషాయ
69 పరమపురుషాయ
70 మహాపురుషాయ
71 పుణ్యోదయాయ
72 దయాసారాయ
73 పురాణపురుషోత్తమాయ
74 స్మితవక్త్రాయ
75 మితభాషిణే
76 పూర్వభాషిణే
77 రాఘవాయ
78 అనంతగుణగంభీరాయ
79 ఓం ధీరోదాత్తగుణోత్తమాయ
80 మాయామానుషచారిత్రాయ
81 మహాదేవాదిపూజితాయ
82 సేతుకృతే
83 జితవారాశయే
84 సర్వతీర్థమయాయ
85 హరయే
86 శ్యామాంగాయ
87 సుందరాయ
88 శూరాయనమః
89 పీతవాససే
90 ధనుర్ధరాయ
91 సర్వ జ్ఞాధిపాయ
92 జ్వనే
93 జరామరణవర్జితాయ
94 శివలింగప్రతిష్ఠాత్రే
95 సర్వావగుణవర్జితాయ
96 పరమాత్మనే
97 పరస్మైబ్రహ్మణే
98 సచ్చిదానందవిగ్రహాయ
99 పరస్మైజ్యోతిషే
100 పరస్మైధామ్నే
101 పరాకాశాయ
102 పరాత్పరాయ
103 పరేశాయ
104 పారగాయ
105 పారాయ
106 సర్వదేవాత్మకాయ
107 పరస్మైనమః
108 శ్రీ రామచంద్రాయ నమః

# శ్రీ కృష్ణాష్టోత్తర శతనామావళిః

1 ఓమ్ శ్రీకృష్ణాయ నమః
2 కమలనాథాయ నమః
3 వాసుదేవాయ
4 సనాతనాయ నమః
5 వసుదేవాత్మజాయ
6 పుణ్యాయ
7 లీలామానుషవిగ్రహాయ
8 శ్రీవత్సకౌస్తుభధరాయ
9 యశోదావత్సలాయ
10 హరయే
11 చతుర్భుజాత్తచక్రాసి
గదాశంఖాద్యుదాయుధాయ
12 దేవకీనందనాయ
13 శ్రీశాయ
14 నందగోపప్రియాత్మజాయ
15 యమునావేగసంహారిణే
16 బలభద్రప్రియానుజాయ
17 పూతనాజీవితహరాయ
18 శకటాసురభంజనాయ
19 నందవ్రజజనానందినే
20 సచ్చిదానందవిగ్రహాయ
21 నవనీతవిలిప్తాంగాయ
22 నవనీతనటాయ నమః
23 అనఘాయ
24 నవనీతనవాహారాయ
25 ముచికుందప్రసాదకాయ
26 షోడశస్త్రీసహస్రేశాయ
27 త్రిభంగినే
28 మధురాకృతయే నమః
29 ఓం శుకనాగమృతాబ్ధీందవే
30 గోవిందాయ
31 యోగినాంపతయే
32 వత్సవాటచరాయ
33 అనంతాయ
34 ధేనుకాసురభంజనాయ
35 తృణీకృతతృణావర్తాయ
36 యమళార్జునభంజనాయ
37 ఉత్తాలతాలభేత్రే
38 తమాలశ్యామలాకృతయే
39 గోపగోపీశ్వరాయ
40 యోగినే
41 కోటిసూర్యసమప్రభాయ
42 ఇలాపతయే
43 పరంజ్యోతిషే
44 యాదవేంద్రాయ
45 యదూద్వహాయ
46 వనమాలినే
47 పీతవాససే
48 పారిజాతాపహారకాయ
49 గోవర్ధనాచలోద్ధర్త్రే
50 గోపాలాయ నమః
51 సర్వపాలకాయ
52 అజాయ
53 నిరంజనాయ
54 కామజనకాయ
55 కంజలోచనాయ
56 మధుఘ్నే
57 మధురానాథాయ

58 ఓం ద్వారకానాయకాయ
59 బలినే
60 బృందావనాంతసంచారిణే
61 తులసీదామభూషణాయ
62 శమంతకమణేర్హర్త్రే
63 నరనారాయణాత్మకాయ
64 కుబ్జాకృష్ణాంబరధరాయ
65 మాయినే
66 పరమపురుషాయ
67 ముష్టికాసుర చాణూర
మల్లయుద్ధవిశారదాయ
68 సంసారవైరిణే
69 కంసారయే
70 మురారయే
71 నరకాంతకాయ నమః
72 అనాదిబ్రహ్మచారిణే
73 కృష్ణావ్యసనకర్శకాయ
74 శిశుపాల శిరచ్ఛేత్రే
75 దుర్యోధనకులాంతకాయ
76 విదురాక్రూరవరదాయ
77 విశ్వరూపప్రదర్శకాయ
78 సత్యవాచే
79 సత్యసంకల్పాయ
80 సత్యభామారతాయ
81 జయినే
82 సుభద్రాపూర్వజాయ
83 జిష్ణవే
84 భీష్మముక్తిప్రదాయకాయ
85 ఓం జగద్గురవే
86 జగన్నాథాయ
87 వేణునాదవిశారదాయ
88 వృషభాసురవిధ్వంసినే
89 బాణాసురకరాంతకాయ
90 యుధిష్ఠిరప్రతిష్ఠాత్రే
91 బర్హిబర్హావతంసకాయ
92 పార్థసారథయే
93 అవ్యక్తాయ నమః
94 గీతామృతమహోదధయే
95 కాళీయ ఫణిమాణిక్య
మండితశ్రీపదాంబుజాయ
96 దామోదరాయనమః
97 యజ్ఞభోక్త్రే
98 దానవేంద్రవినాశకాయ
99 నారాయణాయ
100 పరబ్రహ్మణే
101 పన్నగాశనవాహనాయ
102 జలక్రీడాసమాసక్త
గోపీవస్త్రాపహారకాయ
103 పుణ్యశ్లోకాయ
104 తీర్థపాదాయ
105 వేదవేద్యాయ
106 దయానిధయే
107 సర్వతీర్థాత్మకాయ
108 సర్వగ్రహరూపిణే
పరాత్పరాయనమః

# శ్రీ శివ పూజ

పూర్వోక్తప్రకారము అభిషేక సమర్పణానంతరము అర్చన ప్రారంభించవలయును.

అథ ధ్యానం॥ శాంతం పద్మాసనస్థం శశిధర మకుటం పంచవక్త్రం త్రినేత్రం। శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం దక్షిణాంగే వహంతమ్। నాగం పాశం చ ఘంటాం వర డమరుయుతం చాంబికాం వామభాగే। నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి.

## శ్రీ శివ అష్టోత్తర శతనామావళిః

1 ఓం శివాయ నమః
2 మహేశ్వరాయ నమః
3 శంభవే నమః
4 పినాకినే
5 శశిశేఖరాయ నమః
6 వాసుదేవాయ
7 విరూపాక్షా య నమః
8 కపర్దినే
9 నీలలోహితా య
10 శంకరా య
11 శూలపాణయే
12 ఖట్వాంగినే
13 విష్ణువల్లభా య నమః
14 శిపివిష్టా య
15 అంబికానాథా య
16 శ్రీకంఠా య
17 భక్తవత్సలా య
18 భవా య
19 శర్వా య
20 త్రిలోకేశా య
21 ఓం శితికంఠా య నమః
22 శివాప్రియా య
23 ఉగ్రా య
24 కపాలినే
25 కామారయే
26 అంధకాసురసూదనా య
27 గంగాధరా య
28 లలాటాక్షా య
29 కాలకాలా య
30 కృపానిధయే
31 భీమా య
32 పరశుహస్తా య
33 మృగపాణయే
34 జటాధరాయ
35 కైలాసవాసినే నమః
36 కవచినే
37 కఠోరా య
38 త్రిపురాంతకా య
39 వృషాంకా య నమః
40 వృషభారూఢా య

41 ఓమ్ భస్మోద్ధూళిత విగ్రహాయ
42 సామప్రియాయ
43 సర్వమయాయ
44 త్రయీమూర్తయే
45 అనీశ్వరాయ
46 సర్వజ్ఞాయ
47 పరమాత్మనే
48 సోమసూర్యాగ్నిలోచనాయ
49 హవిషే
50 యజ్ఞమయాయ
51 సోమాయ
52 పంచవక్త్రాయ
53 సదాశివాయ
54 విశ్వేశ్వరాయ
55 వీరభద్రాయ నమః
56 గణనాథాయ
57 ప్రజాపతయే నమః
58 హిరణ్యరేతసే
59 దుర్ధర్షాయ
60 గిరీశాయ
61 గిరిశాయ
62 అనఘాయ
63 భుజంగభూషణాయ
64 భర్గాయ
65 గిరిధన్వనే
66 గిరిప్రియాయ
67 కృత్తివాససే
68 పురారాతయే
69 భగవతే
70 ఓమ్ ప్రమథాధిపాయ
71 మృత్యుంజయాయ
72 సూక్ష్మతనవే
73 జగద్వ్యాపినే
74 జగద్గురవే
75 వ్యోమకేశాయ
76 మహాసేనజనకాయ
77 చారువిక్రమాయ
78 రుద్రాయ
79 భూతపతయే నమః
80 స్థాణవే
81 అహిర్బుధ్న్యాయ
82 దిగంబరాయ
83 అష్టమూర్తయే
84 అనేకాత్మనే
85 సాత్త్వికాయ
86 శుద్ధవిగ్రహాయ
87 శాశ్వతాయ
88 ఖండపరశవే
89 అజాయ
90 పాశవిమోచకాయ
91 మృడాయ
92 పశుపతయే
93 దేవాయ
94 మహాదేవాయ
95 అవ్యయాయ
96 హరయే
97 పూషదంతభిదే
98 అవ్యగ్రాయ

99 ఓమ్ దక్షాధ్వరహరాయ
100 హరాయ
101 భగనేత్రభిదే నమః
102 అవ్యక్తాయ
103 సహస్రాక్షాయ నమః
104 ఓమ్ సహస్రపాదే
105 అపవర్గప్రదాయ నమః
106 అనంతాయ
107 తారకాయ
108 పరమేశ్వరాయ నమః

శ్రీ శివాష్టోత్తర శతనామావళిః సమాప్తా.

1 మంగళం భగవన్ శంభో మంగళం వృషభధ్వజ,
మంగళం పార్వతీనాథా మంగళం భక్తవత్సల.

2 వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం,
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాంపతిం॥

---

## శ్రీలక్ష్మీ నామావళిః.

1 ఓం శ్రీలక్ష్మ్యైనమః
2 ఓం ప్రకృత్యైనమః
3 ఓం విద్యాయైనమః
4 ఓం పద్మాయైనమః
5 ఓం వసుధాయైనమః
6 ఓం వసుధారిణ్యైనమః
7 ఓం కమలాయైనమః
8 ఓం కామాక్ష్యైనమః
9 ఓం శోకవినాశిన్యైనమః
10 ఓం దారిద్ర్యనాశిన్యైనమః
11 ఓం శ్రియైనమః
12 ఓం విష్ణుపత్న్యైనమః
13 ఓం ధనధాన్యకారిణ్యైనమః
14 ఓం వసుంధరాయైనమః
15 ఓం శుభప్రదాయైనమః
16 ఓం ప్రభాయైనమః
17 ఓం సుప్రసన్నాయైనమః
18 ఓం దేవ్యైనమః
19 ఓం వరలక్ష్మ్యైనమః
20 ఓం సముద్రతనయాయైనమః
21 ఓం త్రికాలజ్ఞానసంపన్నాయైనమః
22 ఓమ్ మహాలక్ష్మ్యై నమః
23 ఓమ్ బ్రహ్మావిష్ణుశివాత్మికాయైనమః
24 ఓం మంగళాయైనమః

---

# కీర్తన

1. శ్రీశివశంకర దరిశనమాయెను చింతలుజెందగ నేటికిలేవ,
చేసిన పూర్వాపుణ్యావశంబున శివుడే గురుడై వచ్చెనులే॥శ్రీ॥

2. దేశకాలముల జెందని తత్వము తెలియగ సద్గురు
దెల్పెనులేవ॥
వాసిగ మమతాహంకారములను గోసెడి అసి మన
కిచ్చెనులే ॥శ్రీ॥

3. సప్తభూమికల దాటుట కనువగు నుత్తమమార్గము
జూపెనులేవ॥
జాగ్రత స్వప్న సుషుప్తుల కవ్వలి యుతమ గురుపద
మిచ్చెనులే ॥శ్రీ॥

4. పంచకోశములపై వెలుగొందెడి పరమగురునిగనగల్గెనులేవ,
పంచప్రాణ పంచేంద్రియములపై పరమగోప్యమును
దెల్పెనులే ॥శ్రీ॥

5. నామరూపముల కాశ్రయమగు శ్రీనాథుని మది గను
గొంటినిలేవ,
భామభ్రాంతి బడద్రోయువజ్ఞచే నీమములను కను
గొంటినిలే ॥శ్రీ॥

6. ఎక్కడజూచిన ఒక్కడె గురుడని చక్కగ అనుభవ
మయ్యెనులేవ,
తక్కినదంతయు వంధ్యపుత్రుడని తలచుట సరియని
దోచెనులే ॥శ్రీ॥

7. ఇంకను జన్మపరంపర లేవని ఇరవుగ చరణము లిచ్చెను లేవ, జంకక సత్యము ధర్మము తెలుపుచు వెంకమాంబ నత దేలును లే ॥శ్రీ॥

## — మంగళ హారతులు —

### 1.

1. మాపాలిగురువరేణ్యా మంగళహారతిదిగో గైకొని, మమ్ము వేగ కరుణతోడ బ్రోవరావే ॥మాపాలి గురు॥
2. అమృతమూ లొలికె పలుకు ఆదరణమీరబలికి, బ్రహ్మానందపదవి మాకు దయతోడ నివ్వవయ్యా ॥మా॥
3. దిక్కులేనివారమయ్యా దీనత ఆబాపుమయ్యా, దరిజేర్చి మమ్ము వేగ కరుణింపగదవె తండ్రి ॥మా॥
4. తల్లివి తండ్రివి నీవే దైవాము బంధు నీవే, పలుకాకా యున్న నెవరు పాలించువారు తండ్రి ॥మా॥
5. అనయాము నీదురూపు మనమందు నిలుపు తండ్రి, కను మూసినంతలోనా గనబరపు నీదురూపూ ॥మా॥
6. శ్రీ వర బ్రహ్మానందా చిన్మయామూలకందా, ఈశ్వరాంబ వినుత దేవా ఇకనైనా బ్రోవరావా ॥మాపాలి గురువరేణ్యా॥

### 2

1. మంగళహారతి పొంగుచు నీకిడ శృంగారవతులెల్ల నిలచిరిగా, జనకునివరపుత్రి జనని జానకమ్మ జన్మసాఫల్యాము జేయవమ్మా ॥మం॥

2. వదునాలు గేను లు పుణ్యావనంబునపతి వెంట నేగినవణతివమ్మా గతియెరాముడాని సతతాము మదినమ్మి నుతియించు సీతవు గాదటమ్మా ॥మం॥

3. రావణుండుగోరు రాజీవనేత్రిని రయముగ లంకకుజేర్చగను, రాఘువు రప్పించి రక్కసుబల్మని రాక్షససైన్యాలు గూల్చగను ॥మం॥

4. ఎవనిఅయోధ్య అఖిలవిభంబునుఅభిషి క్తురాలవు గాదటమ్మా, అనయముగ శ్రీఆంజనేయునిజూచి నగుమోమైనను జూపవమ్మ ॥మంగళం॥

3

1. గురునకుమంగళమనరమ్మా సద్గురుమూర్తిని గనుగొనరమ్మా, తరుణులార, యీతరి మన భక్తితో మురియుచు మ్రొక్కిన మోక్షము చేకురు ॥గురు॥

2. క్షరపురుషుండనరాదమ్మా అక్షరపురుషుండనుగాదమ్మా, క్షర పురుషాక్షరపురుషుల కావల పురుషోత్తముడనబరగిన మా యీ ॥గు॥

3. క్షేత్రజ్ఞుండనరాదమ్మా యీ క్షేత్ర మతండనుగాదమ్మా, క్షేత్రజ్ఞుని తక్షేత్రంబును ఏమాత్రము దగులక పాత్రుడైన యీ ॥గురు॥

4. స్మరణరూపుడనరాదమ్మా వీ స్మరణరూపుడనగాదమ్మా, స్మరణలేక వీస్మరణగాక తచ్ఛరణవిస్మరణ ఎరుక లేనియూ॥గు॥

5. దేహియనుట కనరాదమ్మా యీ దేహమతండనగాదమ్మా, అహంభావన కంటుసొంటులగు దేహి దేహములు తెరుబోవనీ ॥గు॥

6. పిండరూపుడనరాదమ్మా బ్రహ్మాండరూపు డన గాదమ్మా, పిండాండ బ్రహ్మాండభాండములు నిండియుండి యవి రెండు గాని యీ ॥గు॥

7. జ్ఞానియనుట కనరాదమ్మ అజ్ఞాని యెట్లోయమ్మ, జ్ఞానాజ్ఞానములోన నొక్కటియు తానుగాకశూన్యానికి మీరిన॥గురు॥

8. యోగియనుటకనరాదమ్మామరిభోగియనుట యెట్లోయమ్మా, యోగి భోగి వుద్యోగము లంటని భాగవతాన్వయభవ కృష్ణుండనె ॥గు॥

9. మేలుకీడులనరాదమ్మా యే మేలు కీడు లవిగాదమ్మా, కాలకూటమునకన్న మిక్కిలగుజాలమాంబవె తక్షణములో బాపిన ॥గురు॥

4

1. గురువరుమదిగని ముదమొందర సద్గురునకు మంగళమన రమ్మా, ఆత్మపరాత్మల నేకముజేసి ఆనందాంబుధి నిలచిన మన యీ ॥గురు॥

2. ఏకమనేకంబులజూపి అనేకంబు నేకముజేసి, సాక్షిభావమున సముడై నిలచిన సాక్షాత్కారుని సమరసమున గని ॥గు॥

3. భారతి నుదయాబ్జమునందు సుస్థిరభావంబున నిలచి, బోధరూపమున తేజోమయులై బాధలెల్ల వడి గూలగనేసిన ॥గురు॥

4. వ్యాసాశ్రమమున వెలసిన యీ వేదమార్గసంచారు మా
వేదనలలోబడి వెతలనొందు ఆ వేదమూరులకు వెదకిన
దొరుకని ॥గురువరు మదిగని ముదమొందర సద్గురు॥

5

1. మంగళమో రాఘవేంద్ర మహితగుణవిసాంద్ర గొనుమ,
అంగనలు చెలంగుచూను శృంగారముగాను నేడు ॥మంగళ॥

2. తాటకిని గూలనేసి దర్పమణచి రాక్షసులను, గాధిసుతునీ
యాగము సంరక్షించిన శ్రీరామచాంద్ర ॥మంగళ॥

3. వాలి నొక్క బాణమేసి వారధిబంధించినావు, వైకుంఠవాస
నీకు వనితలంతగూడి జయా ॥మంగళ॥

4. ఇందువదనలెల్లగూడి పొందుగాను నున్నవేళ, అందముతో
సుందరనీవందుము జయహారతిదిగో ॥మంగళ॥

5. సత్యస్వరూప నీకు నిత్య మంగళామో దేవ, నీరజాక్ష
నిరుపమాన నీలమేఘవర్ణ జాయ రామలక్ష్మినేలురామ
రమ్యగుణ విసాంద్రగొనుమూ॥మంగళమో రాఘవేంద్ర॥

6

1. శివగురు లేకంబని తెలసియు మీ భవభయహారమును
గనకమ్మా, మంగళంబు భవభంగరహితునకు అంగన
మణులూ పొంగుచు నివ్వరె ॥శి॥

2. వేదమంత్రముల వివరించీ ఆ వేదవ్యాసుని మదినుంచీ, వేషధారులా మోసము తెలుసుకు వేదాతీతము వెల్లడిచేసిన ॥శి॥

3. జీవబ్రహ్మభేదంబనియు చింతలన్నిటిని సమయించి, శివ జీవైక్యము సిద్ధంబనియును పరవాక్యంబులు పారద్రోలు ॥శి॥

4. సర్వవ్యాపారమువీడి ఆ సర్వాత్మయె తానని తెలసి, సర్వ ఖల్విదం బ్రహ్మభావముచేభవభావంబు పారద్రోలునా ॥శివ॥

5. వేదవ్యాసుండే యీలో వ్యాసాశ్రమమున వెలసిన నీ సుఖలోగల యీ వాదభేదములు వంచనబుద్ధిచే సంచరించకనె ॥శి॥

7

1. గురువరా మంగళకర తమోహర భాస్కరా పరమ పావనమయ్యె నాదగు భవము నీదరి జేరుటనే ॥గురు॥

2. సంచితాగాములు నశించెను సందియంబులు బాసితిన్, ప్రాంచితానందస్వరూపా గాంచి ధన్యతనొందితిన్ ॥గురు॥

3. మేను నేననుభ్రాంతి తనకున్ దానిరూపము బాయుటన్, దానితో నెలకొన్నత్రిపుటి తాపపుంజము రూపెదన్ ॥గురు॥

4. భేదమున కావాలమై తగు భేదభావము ద్రోసితిన్, మోద మొందితి దార ధన గృహ పుత్రవాంఛల రోసితిన్॥

5. వాగతీతంబైన యొకపరివర్తనంబున మించితిన్, రాగమును ద్వేషంబు ద్రుంచితి రాఘవార్చిత ధన్యతన్ ॥గు॥

సంపూర్ణము.